అపరాధ పరిశోధన అనుబంధం — 49

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## బలి కోరిన కళ్ళజోడు

రచన: లలితకుమారి

## ముష్టి కుక్క

రచన: వసుంధర

## నాలుగు హత్యలు చేసిన హంతకుడు

రచన: యస్. గీతారాణి

## నకిలీ ఫ్రెంకీ

రచన: కంచర్ల రమణ

'శార్వరా' సీరియల్ - పధ్నాల్గో భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 49

జనవరి, 1978

వెల : 3-00 రూపాయలు

ఏడాది చందా 39 రూపాయలు

జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :

శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :

టెంపోరావ్

శ్యాంబాబు

రమణశ్రీ

ఏ. వీ. మోహన్రావ్

సుజనశ్రీ

వసుంధర

కంచర్ల రమణ

కార్యాలయం :

అపరాధ పరిశోధన కార్యాలయం

నారాయణగూడ, హైదరాబాదు-29

ఫోన్-36959

ముద్రణ :

క్రాంతి ప్రెస్,

12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# బలి కోరిన కళ్ళజోడు!

లలితకుమారి

మధ్యాహ్నం ఒంటిగంట అయింది.

అజంతా హోటల్లో భోంచేసి, ఇంటికెళ్ళి ప్రయాణానికి కావలసిన వస్తువులు పేక్ చేసుకోవాలి. రాత్రి ఎనిమిది గంటలకి ఉంది ప్లేన్!

బాల్యంనించీ నాకు రోమన్ చరిత్రపట్లా, వారి పాశ్చాత్య నాగరికతపట్లా ఆసక్తి మెండు. జీవితంలో ఒక్కసారైనా రోమ్‌ను సందర్శించి, అక్కడి చరిత్రాత్మక కట్టడాలు చూసి ఆనందించాలని కలలుగనేవాణ్ణి. ఇన్నాళ్ళకు ఆ అవకాశం చిక్కింది.

అజంతా హోటల్ పార్కింగ్‌లో కారాపి, 'వరల్డ్ టూరింగ్ గైడ్' అనే పుస్తకం అందుకుని లోనికి నడి

చాను. లంచ్ టైమ్ గనక డైనింగ్ హాల్ కిట కిటలాడు తోంది. ఓ మూల రెండు కుర్చీలు ఓ టేబుల్ ఖాళీగా ఉన్నాయి. వెళ్ళి కూర్చున్నాను. బేరర్ రాగానే మీల్స్ ఆర్డర్ చేసి, పుస్తకం తెరిచాను. అందులో ప్రపంచ దేశాల తాలూకు వివరాలన్నీ పొందుపరిచి వున్నాయి.

ముందు రోమ్ సిటీ చాప్టర్ తెరిచాను. ఆ నగరంలో చూడదగ్గ ప్రదేశాలూ, అక్కడ బస చెయ్యడాని కను కూలమైన హోటళ్ళ వివరాలూ ఇతర ముఖ్యమైన చిరు నామాలూ చూస్తున్నాను.

అంతలో — "ఎక్స్‌క్యూజ్ మి!" అన్న కమ్మని కంఠం విని, ఉలిక్కిపడి తలెత్తాను.

పాతికేళ్ళుంటాయామెకి. సన్నగా రివటలా ఉంది. ముఖంలో అందంకన్నా ఆకర్షణ ఎక్కువ.

"ఎస్, ప్లీజ్!" అన్నాను.

"హాల్లో ఎక్కడా ఖాళీ లేదు. ఇక్కడ కూర్చో వచ్చా?" అడిగింది నా ఎదురుగా ఉన్న కుర్చీ చూపిస్తూ.

తలూపాను.

ఆమె కూర్చుని, మీల్స్ ఆర్డరిచ్చింది బేరర్‌కి.

భోజనం రాగానే, చేతిలో ఉన్న పుస్తకాన్ని టేబిల్ మీద పెట్టి, భోజనాని కుపక్రమించాను. ఆమె దృష్టి అనుకోకుండా టేబుల్ మీది పుస్తకంమీద నిలిచింది.

"మీరు ఫారిన్ టూర్ వెళుతున్నారా?" అడిగింది కలుపుగోలుగా.

"ఔను. రోమ్, ఈజిప్టు పర్యటించి రావాలనుకుంటు న్నాను" అన్నాను రవ్వంత గర్వంగా.

''ముందు ఈజిప్టునించి ప్రారంభిస్తారా?''

''నో! ముందు రోమ్, తరవాత ఈజిప్టు!''

''నేనూ ఈమధ్య మా నాన్నగారితో ఈజిప్టు వెళ్ళొచ్చాను. మా డాడీ పెద్ద బిజినెస్ మాగ్నెట్. ఆయన వెంట దాదాపు ప్రపంచ దేశాలన్నీ చూసే అవకాశం కలిగింది నాకు...ఎలాగూ మీరు ఈజిప్టు వెళుతున్నారు కదా, చిన్న సహాయం చేసిపెడతారా నాకు?''

''చెప్పండి!''

''ఈమధ్య నేను ఈజిప్టు వెళ్ళినప్పుడు, అక్కడి అమెరికన్ ఆయిల్ రిఫైజ్ కంపెనీలో పనిచేసే త్రిలోక్ చంద్ అనే అతను పరిచయమయ్యేడు నాకు. అతను భారతీయుడే. ఉద్యోగరీత్యా అక్కడ స్థిరపడ్డాడు.

నేను తిరిగి వచ్చేరోజు నన్ను సెండాఫ్ జెయ్యడానికి విమానాశ్రయంకి వచ్చాడు త్రిలోక్ చంద్. ఇద్దరం అక్కడి కేంటీన్‌లో భోజనం తీసుకున్నాం. అప్పుడు జ్ఞాపకం వచ్చిందతనికి, తన కళ్ళజోడు విషయం! కనిపించలేదు

పాపం, అతనికాస్త చత్వారం జాస్తి, నన్ను విమానం ఎక్కించి, కళ్ళజోడు లేకుండానే వెళ్ళిపోయాడు. విచిత్రం ఏమిటంటే, నేను భారతదేశం చేరాక, కస్టమ్స్‌వాళ్ళు నా సామాను గాలిస్తే అతని కళ్ళజోడు నా ఏర్ బేగ్‌లో కనిపించింది!

ఈజిప్టు నగరంలో తిరుగుతున్నప్పుడు నేనే, జాగ్రత్త కోసం అతని కళ్ళజోడు నా ఏర్ బేగ్‌లో పడేసి ఉంటాను. తరవాత మర్చిపోయుంటాను. ఇక్కడది కనిపించగానే అతనికి టెలిగ్రాం పంపాను!

దాని కథను, భారతదేశంనించి ఈజిప్టు వాళ్లెవ్వరి చేతైనా పంపించమని రిక్వెస్టు ఇచ్చాడు. అందుకే అడిగాను మిమ్మల్ని..."

"నేను రోమ్‌నించి ఈజిప్టుచేరేసరికి వారంరోజులైనా పడుతుంది. పోస్టులో పంపేస్తే పోలా?" అన్నాను.

"నేనూ అదే అనుకున్నాను. కాని, త్రిలోక్ అందు కొప్పుకోలేదు. దాన్ని పార్శిల్లో పంపితే విరిగిపోవచ్చనీ, అది తన ప్రేయసి జ్ఞాపక చిహ్నంగా ప్రెజెంట్ చేసిన వస్తువనీ, టెలిగ్రాంలో వివరించాడు."

"సరే, నేనే తీసికెళ్ళిస్తాను. ఇప్పుడా కళ్ళజోడు మీ దగ్గరుందా?"

ఆమె నవ్వి—"మీ పరిచయం అనుకోకుండా ఇలా కలుగుతుందని నేను కలగన్నానా? మీ ఇంటి అడ్రస్ చెప్పండి. అక్కడికే తెచ్చిస్తాను," అంది.

"నేనీ రాత్రే బైలుదేరబోతున్నాను, ఎనిమిదిగంటల ప్లేన్‌లో! మీరు ఏడుగంటలకల్లా తెచ్చివ్వాలి" అంటూ జేబులోంచి డైరీ తీసి నా చిరునామా రాసిచ్చాను.

"థాంక్స్! సరిగ్గా ఏడుగంటలకి వచ్చి కలును కుంటాను" అంటూ లేచిందామె.

"ఇంతకీ, మీ పేరేమిటో చెప్పనేలేదు."

"మండోదరి!" అంది నవ్వుతూ.

# 2

ఇంట్లో సామాను పేక్ చేసుకుంటున్నాను, సూట్ కేసుల్లో.

అంతలో కాలింగ్ బెల్ మోగింది.

వెళ్ళి తలుపు తెరిచాను.

మండోదరి!

"నమస్తే! కళ్ళజోడు తెచ్చాను" అంటూ వేనిటీబేగ్ లోంచి ఓ బ్లూ కలర్ ఆప్టికల్ కేస్ తీసి అందించింది. "త్రిలోక్ చంద్ అడ్రస్ అందులోనే ఉంది. అతనికి టెలిగ్రాంకూడా ఇచ్చాను మీ వెంట కళ్ళజోడు పంపుతున్నట్లు," అంది కృతజ్ఞతగా.

"ఇంకా అవతలే నిల్చున్నారేమిటి? రండి లోనికి" అన్నాను తలుపు కడ్డం తొలుగుతూ.

"సారీ! నాన్నగారి వెంట ఓ పార్టీకెళ్తున్నాను. ఆయన బైట కార్లో ఎదురుచూస్తున్నారు. మీ వెంట విమానాశ్రయం వరకూ రాలేకపోతున్నందుకు మన్నించాలి!"

"నెవర్ మైండ్! అంత అర్జంటుంటే వెళ్ళండి. మీ కళ్ళజోడు సురక్షితంగా చేరగలదు, మీ ఫ్రెండుకు!"

"మెనీ థాంక్స్! వస్తాను" అని వెళ్ళిపోయిందామె.

ఇంట్లోకి వచ్చి, స్పెక్టికల్ కేస్ తెరిచాను. లోపల లావుపాటి అద్దాలు బిగించిన, ఫోర్ స్క్వేర్ బ్లాక్ ఫ్రేం కళ్ళజోడుంది. దానిమీదే మడత పెట్టిన చిన్న చీటీ ఉంది.

విప్పి చూశాను.

'త్రిలోక్ చంద్ (జూనియర్ ఇంజినీర్)
అమెరికన్ ఆయిల్ రిఫైన్ కంపెనీ.
ఫారూక్ రోడ్, కైరో!'

చీటీ పెట్టేసి కళ్ళజోడు తీశాను. దాన్ని కళ్ళకి పెట్టుకుని, అడుగు ముందుకేయబోయి, క్రింద పడబోతూ నిలదొక్కుకున్నాను. ఆ త్రిలోక్ చంద్ మీద రవంత జాలేసింది. ఎందుకంటే ఆ కళ్ళజోడుపయోగించే వ్యక్తి దాదాపు అంధుడే అయుండాలి!

వెంటనే దాన్ని తీసి, కేస్‌లో పెట్టేశాను.

ఏడున్నరకి, సామానుతో టాక్సీ ఎక్కి ఎర్‌పోర్ట్ చేరుకున్నాను.

సరిగ్గా ఎనిమిది గంటలకి, నింపుచూలిలా నేలని విడిచి, నీలిగగనంలోకి ఎగిసింది ప్లేన్!

# 3

మర్నాడు మధ్యాహ్నం రోమ్ ఎర్‌పోర్టులో దిగి, తిన్నగా ఎంబెస్సీ హోటల్ చేరుకున్నాను. కౌంటర్ని సమీపించి, సింగిల్ రూం కావాలని చెప్పాను క్లర్క్‌తో.

అప్పుడే, రిజిస్టర్లో సంతకం చేస్తున్న ఓ వ్యక్తి మీద పడింది నా దృష్టి. భారతీయుడిలా ఉన్నాడు. ఆరడుగుల పొడుగు, విశాలమైన వక్షం, కణతల దగ్గర నెరసిన జుత్తు...

అతని సంతకం అయ్యాక, రిజిస్టర్ని నావైపు తోశాడు క్లర్క్. ఓ బేరర్ని పిలిచి, అతనికి తాళంచెవి ఇస్తూ, ''వీరి సామాను రూం నెంబర్ 201 లో పెట్టు'' అన్నాడు.

బేరర్ ఆ వ్యక్తి సామాను ఎత్తి లిఫ్ట్‌వైపు వెళ్ళాడు. ఆ వ్యక్తి అతన్ని అనుసరిస్తూ వెళ్ళిపోయాడు.

ఆలోగా నేను రిజిస్టర్లో నా వివరాలు రాసి, సంతకం పెట్టాను.

క్లర్క్ మరో బేరర్ని పిలిచి, ''వీరి సామాను రూం నెంబర్ 202 లో పెట్టు!'' అన్నాడు తాళంచెవి ఇస్తూ.

అంటే, ఆ ఆరడుగుల వ్యక్తి గదీ, నా గదీ ఎదురు బొదురుగా ఉన్నాయన్నమాట. బేరర్ని అనుసరిస్తూ

లిఫ్ట్‌లో సెకండ్ ఫ్లోర్ చేరుకున్నాను. నా అంచనా కరక్టే! రూం నెంబర్ 201 ముందు నిల్చున్నాడతను. బేరర్ తాళంచెవి కీ హోల్లో దూర్చి తలుపు తెరవడానికి తంటాలు పడుతున్నాడు.

నా వెంట వచ్చిన బేరర్ కూడా, నా రూం నెంబర్ 202 ముందు సామాను దించి, తాళంచెవితో తలుపు తెరవడానికి ప్రయత్నించాడు. తలుపు తెరుచుకోలేదు. అటు ఆ తలుపూ, ఇటు ఈ తలుపూ తెరుచుకోకుండా మారాం జేస్తున్నాయి.

ఆ వ్యక్తి కాసేపు ఈ తమాషా చూసి, అతని బేరర్ని పక్కకి జరిపి, కీ హోల్లోంచి తాళంచెవి అందుకుని, నా గది తలుపు దగ్గరికి వచ్చాడు. నాతో వచ్చిన బేరర్ని కూడా పక్కకి జరిపి, కీ హోల్లోంచి తాళంచెవి తీసి, రెండో కీని రంధ్రంలో దూర్చి తిప్పేడు.

తలుపు తెరుచుకుంది!

అతను నా వైపు తిరిగి_"కౌంటర్ క్లర్కు, తొందరలో మన తాళంచెవులు మార్చి ఇచ్చేడు. బహుశా, మీరు పాకిస్తాన్ నించో, భారతదేశంనించో వచ్చుంటారను కుంటాను. మీ ఫీచర్స్ అలా ఉన్నాయి. అందుకే అడిగాను" అన్నాడు నవ్వుతూ.

"నేను భారతీయుణ్ణి. నన్ను సారధి అంటారు."

"నేనూ భారతీయుణ్ణే. నా పేరు ప్రతాప్ సింగ్' హార్యానా వాస్తవ్యుణ్ణి. గ్లాడ్ టు మీట్ యూ!' అంటూ ఆనందాతిరేకంతో కరచాలనం చేశాడతను.

"రోమ్ చూడ్డానికొచ్చారా?" అడిగాను.

"నో! పనిమీద తరుచూ వస్తూ పోతుంటాను. మీరు?"

"సెలవులు గడపడానికి! వారం రోజుల ప్రోగ్రాం వేసుకున్నాను...ఓ. కే. మళ్ళీ కలుసుకుందాం!" అంటూ నా గది తలుపు తోసి లోనికెళ్ళాను.

బేరర్ వచ్చి సామానులు తెచ్చి టేబిల్ మీద పెట్టి వెళ్ళాడు.

కాసేపు నిద్రపోయి, ప్రయాణబడలిక తీర్చుకోవాలి. స్నానం అదీ కానిచ్చి, భోజనం తెప్పించుకు తిని, తలుపులు బిగించి మంచంమీద వాలాను.

వెంటనే నిదరపట్టేసింది.

# 4

సాయంత్రం ఐదు గంటల ప్రాంతంలో కళ్ళు తెరిచాను. బాత్ రూంలో దూరి, ఇవతలికి వచ్చాక మైండ్ ఫ్రెష్ అయింది. సూట్ తొడుక్కుని టై కట్టుకుంటున్నాను.

అప్పుడు మోగింది గదిలో కాలింగ్ బెల్!

టై ముడి బిగించుకుంటూ వెళ్ళి తలుపు తెరిచాను. గుమ్మాని కవతల స్థానికవ్యక్తి ఎవ్వరో నిల్చునున్నాడు.

"మిస్టర్ సారథి మీరేనా?" అడిగాడు నన్ను పరీక్షగా చూస్తూ.

తలూపి, "మీరెవ్వరు?" అడిగాను.

అతను నవ్వి—"నేను ఇన్స్పెక్టర్ అలెగ్జాండర్ని! మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి" అన్నాడు.

ఓ పోలీస్ ఆఫీసర్ కి నాతో ఏమిటి పని?

"రండి!" అన్నాను తలుపు కడ్డం తొలుగుతూ.

"మిస్టర్ సారథీ! మీ రిక్కడికి వచ్చేముందు, ఢిల్లీలో మండోదరి అనే యువతిని కలుసుకున్నారు కదూ?"

"ఔను! ఆ సంగతి మీ కెలా తెలుసు?" అడిగాను నివ్వెరబోతూ.

"నా కెలా తెలుసో తరువాత వివరిస్తాను. ముందు నా ప్రశ్నలకి సూటిగా జవాబివ్వండి. ఆమె మీ స్నేహితురాలా? ఎంతకాలంనించి పరిచయం?"

"ఆమె నా స్నేహితురాలూ కాదు, పాత పరిచయమూ లేదు. అనుకోకుండా తనే నన్ను పరిచయం చేసుకుంది. తరవాత అదేరోజు సాయంత్రం ఓ వస్తువు ఇవ్వడానికి నా ఇంటికి వచ్చింది. ఒకే ఒక్క నిమిషం తలుపు దగ్గరుండి వెళ్ళిపోయింది. అంతే!"

"ఆమె మీ ఇంటికి వచ్చినప్పుడు సరిగ్గా టైం ఎంతై ఉంటుంది?"

"ఏడున్నర!"

"ఆమె మీ కిచ్చిన వస్తువేమిటి?"

"కేవలం ఓ కళ్ళజోడు! దాన్ని కైరోలో ఉన్న తన స్నేహితుడి కివ్వమని చెప్పింది!"

"దాన్నోసారి చూపిస్తారా?"

"నిరభ్యంతరంగా!" అంటూ కోటు జేబులోంచి ఆప్టికల్ కేస్ తీసి అందించాను.

ఇన్స్పెక్టర్ కేస్ తెరిచి, కళ్ళజోడు తీసి పరిశీలించి "దీన్ని నా వెంట తీసుకెళ్ళి లేబొరేటరీలో పరీక్ష చేయిస్తాను!" అన్నాడు.

"ఇందులో ఏమైనా దాచబడిందని మీ అనుమానమా...?" అడిగాను కాస్త యెరుపెక్కిన మొహంతో.

ఇన్స్పెక్టర్ నవ్వి—"నో! ఇప్పుడేమీ చెప్పలేను.

టెస్టింగ్ తరువాతే ఏమైనా తెలిసేది" అన్నాడు.

"సరే, టెస్టు పూర్తయ్యాక నా కిచ్చెయ్యాలి. ఎందు కంటే, ఇది మరొకరి సొత్తు! క్షేమంగా అందజేస్తానని ఆమెకి మాటిచ్చాను."

"తప్పకుండా! మీకు రసీదిచ్చి మరీ తీసికెళ్తాను."

"ఐతే, ముందు మీ ఐడెంటిఫికేషన్ కార్డు చూపండి. మీరు నిజంగా పోలీస్ ఇన్‌స్పెక్టరని నాకు నమ్మకం కుదరాలిగా!"

అతను తలూపి, జేబులోంచి ఐడెంటిఫికేషన్ కార్డు తీసి అందించాడు.

దాన్ని చూశాక, అతను నిజంగా ఇటలీదేశపు పోలీస్ అధికారని రూఢి అయింది.

కార్డ్ తిరిగి ఇచ్చేస్తూ "ఆల్ రైట్! ఇప్పుడు చెప్పండి. ఢిల్లీలో మండోదరి నన్ను కలుసుకున్న విషయం మీకెలా తెలిసింది?" అడిగాను.

"ఢిల్లీ పోలీసులకు మీఇంటి కాంపౌండ్‌లో, క్రోటన్ మొక్కలమధ్య మండోదరి శవం దొరికింది! మీరు ఏ రాత్రి అక్కణ్ణించి బైలుదేరారో అదే రాత్రి ఏడూ ఎనిమిదీ మధ్య ఆమె హత్య జరిగినట్టు శవపరీక్షలో తేలింది. అంటే,మిమ్మల్ని కలుసుకున్న కొద్దిసేపట్లోనే."

ఇన్‌స్పెక్టర్ కథనం వినగానే దిగ్భ్రాంతితో నోరు తెరిచాను.

ఎలా నమ్మాలి? ఆ రాత్రి ఆమె నన్ను కలుసుకుని, తన తండ్రి బైట కార్లో ఎదురుచూస్తున్నాడనీ, ఏదో పార్టీ కెళ్తున్నామనీ, కళ్ళజోడిచ్చి వెళ్ళిపోయింది!

ఆమె తండ్రి బైట ఉండగా, ఆమె హత్య జరిగితే,

అతనేంచేస్తున్నట్టు? పోలీసులకి తెలియజెయ్యలేదా? ఉదయంవరకూ శవం అక్కడెలా వుంది? అదే చెప్పేను ఇన్‌స్పెక్టర్‌కి.

ఇన్‌స్పెక్టర్ నవ్వి—"బహుశా, మండోదరి మీతో అబద్ధం చెప్పుంటుంది. అలా దేనికి చెప్పిందో మనకు తెలీదు. పోలీసులు ఆ ఇల్లు మీదేనని గుర్తించి మీ సి. బి. ఐ. హెడ్‌క్వార్టర్స్‌కెళ్ళి ఆరా తీశారు. అప్పుడు తెలిసింది. మీరు నెలరోజులు సెలవుపెట్టి ఫారిన్‌టూర్ మీద ఇక్కడికి వచ్చినట్టు.

వెంటనే యిక్కడి మా హెడ్‌క్వార్టర్సుకు కేబుల్ పంపారు. మీ గురించి వాకబ్ చేసి, వివరాలు కనుక్కోమని. ఆ డ్యూటీ నా కప్పగించబడింది. మీరు చెప్పిన విషయాలు వెంటనే వాళ్ళకి తెలిజేస్తాను. ఈ కళ్ళజోడు నిజంగా మామూలు కళ్ళజోడే అని మా నిపుణులు సర్టిఫైచేస్తే మళ్ళీ తెచ్చిస్తాను" అంటూ రసీదు రాసిచ్చి వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టర్.

అంతా అయోమయంగా ఉంది. మండోదరిని నా ఇంటిదగ్గర ఎవ్వరు హత్య చేసేరు? ఆమె నాతో ఎందుకు అబద్ధం చెప్పింది? ఆ కళ్ళజోడులో నిజంగా ఏదైనా మిస్టరీ దాగుందా?

ఇక్కడ ఒంటరిగా కూర్చుంటే ఇలాటి ఆలోచనలు బుర్రని తొలిచేస్తాయి. నేను వచ్చింది నాలుగురోజులు కులాసాగా గడపడానికి, హత్యలూ, ఖూనీలతో సతమతమవడానిక్కాదు.

గది లాక్ చేసి, బైలుదేరాను నైట్‌క్లబ్‌కు.

దాదాపు పన్నెండుగంటలవరకూ క్లబ్బులో కులా

సాగా గడిచిపోయింది. మన క్లబ్బులతో పోలిస్తే ఇక్కడ మరీ 'పచ్చి'గా వ్యవహరిస్తారనిపించింది, ఆడా మగా!

తిరిగి హోటల్ జేరుకున్నాను.

నా గది తలుపు తెరిచి, లోన అడుగుపెట్టి కొయ్యబారిపోయేను. గదంతా ఎవ్వరో దేనికోసమో గాలించినట్టు, వస్తువులన్నీ చిందరవందర జేసి ఉన్నాయి!

సామానంతా అస్తవ్యస్తంగా పడుంది టేబిల్ పైన. మంచంమీది డన్ లప్ పరుపూ, తలగడలూ బ్లెయిడ్ లతో కోసి ముక్కలు చేసున్నాయి. గది తలుపు లాక్ చేసుండగా ఎలా జరిగిందిది? దేనికోసం వెతకబడింది?

వళ్ళు మండిపోయి, ఫోన్ చేసి హోటల్ బలగాన్ని పిలిపించేను.

హోటల్ మేనేజర్ నా కాళ్ళావేళ్ళా పడసాగాడు. "రభస చెయ్యకండి సార్! ఈ హోటల్ ప్రారంభించి ఐదేళ్ళవుతోంది. ఇలాటి సంఘటన జరగడం యిదే ప్రథమం!

కస్టమర్స్ దిగిన గదుల్లో దొంగతనాలు జరక్కుండా చూడ్డానికి, మా ప్రత్యేకమైన సెక్యూరిటీ స్టాఫ్ ఉంటుంది హోటల్లో. ఐనా, ఇలా జరిగిందంటే, నాకే ఆశ్చర్యంగా ఉంది. తక్షణం వారిమీద చర్య తీసుకుంటాను. మీరు మాత్రం గొడవపెట్టకండి. హోటల్ పరువు పోతుంది. వెంటనే మీ గదిలో కొత్త ఫర్నిచర్ ఏర్పాటు చేయిస్తాను."

అతని అవస్థ చూసి శాంతించాను.

అరగంటలోపల గది తిరిగి మామూలు స్థితికి వచ్చింది.

కొత్త పరుపూ దిళ్ళూ అమర్చారు. సోఫా సెట్టు మార్చారు. సామాను ఎక్కడిదక్కడ సర్ది వెళ్ళారు.

ఎడతెరిపిలేని ఆలోచనలతో తలుపు మూసి మంచం మీద వాలాను.

# 5

ఉదయం స్నానం ముగించి, బట్టలు మార్చుకుంటుండగా, కాలింగ్ బెల్ మోగింది.

తలుపు తెరిచాను.

ఇన్‌స్పెక్టర్ అలెగ్జాండర్!

"గుడ్ మార్నింగ్! వెల్‌కమ్ ప్లీజ్!" అన్నాను ఆహ్వానిస్తూ.

సోఫాలో చతికిలబడి, జేబులోంచి ఆప్టికల్ కేస్ తీశాడు.

"రిజల్ట్ ఏమిటి?" అడిగాను క్యూరియస్‌గా.

"నిల్ రిపోర్ట్! మా నిపుణులు దీన్ని క్షుణ్ణంగా పరిశీలించారు. ఎక్స్‌రే కూడా తీసి చూశారు. ఇందులో ఏమీ లేదు. మామూలు కళ్ళజోడే అని తేలింది!"

"థాంక్స్" అంటూ కేస్ అందుకుని కోటులోపల జేబులో వేసుకున్నాను.

"మీరిక్కడ ఎన్నిరోజులు మకాం చేస్తున్నారు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"కేవలం వారం రోజులే. ఇక్కణ్ణించి సరాసరి కైరో వెళ్ళాలి."

"ఆల్ రైట్! అవసరం కలిగితే మళ్ళీ వచ్చి కలుసుకుంటాను" అంటూ లేచాడు ఇన్‌స్పెక్టర్.

"ఢిల్లీనించి ఇంకేమైనా సమాచారం అందిందా?"

అడిగాను అతన్ని తలుపువరకూ సాగనంపుతూ.

"లేదు. నేను మీ నించి సేకరించిన వివరాలు వాళ్ళకి తెలిచేశాను" అని వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టర్.

గది లాక్ చేసి, నగరంలోని టూరిస్ట్ గైడ్ ఆఫీసుకెళ్ళి, ఓ గైడ్‌ను వెంటబెట్టుకొని, పగలంతా అక్కడి పాశ్చాత్య కట్టడాలు చూడటంలో గడిపాను. అన్నీ చూసి వచ్చేసరికి, రాత్రి ఎనిమిది గంటలయింది.

క్రితంరోజు కనిపించిన భారతీయుడు ప్రతాప్‌సింగ్ మళ్ళీఎక్కడా కనిపించలేదు నాకు. అతని గది తలుపు ఉదయంనించీ మూసేవుంది.

అలసివున్న కారణంగా నిదుర ముంచుకువస్తోంది.

భోంచేసిన అరగంట తరవాత, లైటార్పి పక్కమీద వాలాను.

అర్ధరాత్రి, ఎందుకో చటుక్కున నిదర మేల్కొంది. పరిసరాలన్నీ సూదిపడితే వినిపించే నిశ్శబ్దంలో మునిగి ఉన్నాయి.

దిండు కిందినించి రిస్టువాచీ తీసి చూశాను.

రాత్రి రెండుగంటలు!

నా కెదురుగా ఉన్న గదిలోంచి ఆగి ఆగి ఏవో చిత్ర విచిత్ర శబ్దాలు వినిపిస్తున్నాయి. అందుకే నా నిదర మేల్కొనుంటుంది. ఆ గదిలో ప్రతాప్‌సింగ్ ఉన్నాడు. ఈ అర్ధరాత్రి ఆ శబ్దాలేమిటి?

లేచి కూర్చున్నాను.

స్లిప్పర్స్ తొడుక్కుని తలుపువైపు నడిచాను. హోటల్ యావత్తూ నిశ్శబ్దంలో మునిగి ఉండటంవల్ల, ఎదటి గదిలోంచి ముక్కలూ, మూలుగులూ వినిపిస్తున్నాయి స్పష్టంగా!

ప్రతాప్ సింగ్ కేదైనా అవాంతరం ముంచుకురాలేదు కదా?

తలుపు తెరిచి బైటికి వచ్చాను. సరిగ్గా అదే సమయంలో నా గది పక్కనున్న గది తలుపు తెరుచుకుంది. సన్నగా రివటలా ఉన్న ఒకతను ఇవతలికి వచ్చాడు.

నైట్ డ్రెస్‌లో ఉన్న అతని ఎముకలు లెక్క పెట్టుకోమన్నట్టు వెళ్ళుకువచ్చి కనిపిస్తున్నాయి. ఏదో జబ్బుతో బాధపడుతున్నట్టు మొహం పీక్కుపోయి ఉంది. గుంటలు పడ్డ కళ్ళు.

దాదాపు ముప్పైఐదేళ్ళుంటాయతనికి.

ముఖకవళికలు భారతీయుడిలా ఉన్నాయి!

“మీరూ ఆ శబ్దాలు విని మేల్కొన్నారా?” అడిగాడు నన్ను.

తలూపి, “మీరు భారతీయులా?” అడిగాను.

“ఔను! నా పేరు ఓంప్రకాశ్. ఆరేళ్ళనించీ క్షయ రోగంతో బాధపడుతున్నాను. కావలసినంత డబ్బుంది. ఏం లాభం? సుఖంలేదు. అమెరికాలో లంగ్స్ ఆపరేషన్ చేయించుకుని, మన దేశం వెళుతూ కొన్నాళ్ళు రెస్టు తీసుకుందామని దిగానిక్కడ” అన్నాడతను.

“నా పేరు సారధి! ఆ గదిలో ప్రతాప్ సింగ్ అనే భారతీయుడు నివసిస్తున్నాడు. మీకు తెలుసా అతను?” అడిగాను.

“తెలీదు! నేను సాధారణంగా గదిలోంచి బైటికి రాను. రాత్రి ఓ పట్టాన నిదర పట్టదు. పావుగంటనించీ ఆ గదిలో చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. ఇప్పుడు మీరు బైటికి వచ్చిన శబ్దం విని, ఏమిటో చూద్దామని లేచి

వచ్చాను. రండి!'' అంటూ ఆ గదివైపు నడిచాడతను.

మేమా గదిని సమీపించగానే, హఠాత్తుగా చప్పుళ్ళు ఆగిపోయాయి.

''ప్రతాప్ సింగ్!'' పిలిచాను.

జవాబు లేదు.

లోపల ఏదో చటుక్కున మూసుకున్న చప్పుడు!

''ప్రతాప్ సింగ్!'' పిల్చాను మళ్ళీ.

నిశ్శబ్దం!

విచిత్రంగా ఉంది. లోపల ఎవ్వరో ఉన్నారు. పిలిస్తే పలకడం లేదు.

''ప్రతాప్ సింగ్! నేను, సారధిని. తలుపు తెరవండి'' అన్నాను గట్టిగా.

అదే నిశ్శబ్దం!

ఏమైతే అయిందని పిడి తిప్పి తలుపు తోశాను. కొద్దిగా తెరుచుకుంది.

లోపల చిమ్మచీకటి!

నేనూ, ఓంప్రకాశ్ ఒకరి మొహం ఒకరం చూసుకున్నాం.

''ప్రతాప్ సింగ్!''

గదిలోంచి ఎలాటి అలికిడీ లేదు.

''మీ దగ్గర టార్చి ఉంటే తీసుకురండి!'' అన్నాను ఓంప్రకాశ్ తో.

గబగబ తన గదివైపు వెళ్ళాడతను.

తలుపులు తిరిగి మూసేసి, అతనికోసం ఎదురుచూడసాగాను.

క్షణంలో వచ్చాడు ఓంప్రకాశ్ టార్చితో.

దాన్ని వెలిగించి, తలుపు తెరిచి, లోన అడుగెట్టాం! గదిలో మనిషిమాత్రుడు లేడు.

కనీసం ప్రతాప్‌సింగ్ సామానుకూడా లేదక్కడ. కిటికీల కడ్డంగా కర్టెన్స్ వేళాడుతున్నాయి. ఇంతసేపూ వినిపించిన శబ్దాలేమిటి? ప్రతాప్‌సింగ్ ఏమయ్యాడు?

గోడకున్న స్విచ్ వత్తి లైటు వెలిగించాడు ఓంప్రకాశ్.

అప్పుడు చూశాను. ఓ గోడకానించి ఉన్న నిలువెత్తు బట్టల బీరువాని. అందులో ప్రతాప్‌సింగ్ బట్టలేమైనా ఉన్నాయేమో చూద్దామని అటు నడిచాను. బీరువా పిడి తిప్పి తలుపు తెరిచాను. అంతే!

ఓ ఆకారం అమాంతం నామీద పడింది!

బేలెన్స్ తప్పి పడబోతూ నిలదొక్కుకుని ఆ దేహాన్ని పొదివి పట్టుకున్నాను.

అది శవం! స్త్రీ శవం!!

నేలమీద పడుకోబెట్టి, పరీక్షగా చూశాను. అంతే!

నా ఊపిరి ఒక్కసారి ఆగిపోయినట్టు తోచింది!

ఆమె ఎవ్వరో కాదు.

మండోదరి!

ఢిల్లీలో నా కాళ్ళజోడిచ్చిన మండోదరి!!

ఏమిటీ మాయ? ఎలా సంభవం? ఇన్‌స్పెక్టర్ అరొగాండర్ వచ్చి, ఢిల్లీలో నా ఇంటి కాంపౌండ్లో ఆమె శవం కనిపించిందని చెప్పాడే. మరి ఇక్కడికెలా వచ్చింది ఆమె శవం?

చటుక్కున వంగి శవాన్ని తాకిచూశాను. ఇంకా వెచ్చగా ఉంది. అంటే హత్య జరిగి పదినిమిషాలుకూడా

కాలేదన్నమాట. గొంతు నులిమి చంపినట్లు ఆమె కంఠం ఉబ్బి ఉంది.

పావుగంట క్రితం గదిలోంచి చప్పుళ్ళూ, మూలుగులూ వినిపించాయి. మేము వచ్చి చూస్తే ఎవ్వరూ లేరు. శవం బీరువాలో ఉంది. ప్రతాప్ సింగ్ సామానుతో సహా అపు లేడు. ఈ హత్య అతనే చేశాడా? ఐతే, ఏమయ్యాడు?

సడన్ గా ఆలోచన వచ్చింది. గబగబ కిటికీలకి వేళాడుతున్న కర్టెనవైపు నడిచాను. ఒక్కో కర్టెన్ తొలగించి చూస్తే, ఓ కిటికీ రెక్కలు తెరిచి ఉన్నాయి. కిటికీ పక్కనే నీటిగొట్టం. కిటికీమీద బూట్ల ముద్రలు!

సందేహాలు తొలగిపోయాయి. హత్య ప్రతాప్ సింగ్ చేశాడు. మేము వస్తున్న చప్పుడు విని, సామానుతో కిటికీపక్క నీటిగొట్టంద్వారా కిందికి జారుకున్నాడు.

అతనికీ, ఈమెకీ ఏమిటి సంబంధం? అతనికోసమే గదిలోకి వచ్చిందా?

దేనికి చంపేడు? ఢిల్లీలో, నా ఇంటి కాంపౌండ్లో దొరికిన శవం ఎవరిది?

అన్నీ ప్రశ్నలు, జవాబు దొరకని ప్రశ్నలు. ఏదిఏమైనా, ఆ కళ్ళజోడు నా దగ్గరికి వచ్చినప్పటినించే ఈ చిత్ర విచిత్ర సంఘటనలు ఆరంభమయ్యాయి!

"మిస్టర్ ఓంప్రకాశ్! వెంటనే వెళ్ళి హోటల్ మేనేజర్ని పిల్చుకురండి" అన్నాను.

అతను గబగబ బైటికి నడిచాడు.

రెండు నిమిషాల వ్యవధిలో, అక్కడ జాతర తయారయింది. హుటాహుటిన వచ్చారు పోలీసులు. నన్నూ,

ఓంప్రకాశ్ నీ ప్రశ్నల వర్షంతో ప్రాణాలు తోడేశారు. వాళ్ళబారినించి తప్పించుకోడానికి తలప్రాణాలు తోక్కొచ్చాయి!

# 6

ఉదయం ఎనిమిదిగంటల ప్రాంతంలో, కాలింగ్ బెల్ మోగింది.

వెళ్ళి తలుపు తెరిచాను.

"గుడ్ మార్నింగ్ మిస్టర్ సారథీ!" అన్నాడు ఓంప్రకాశ్.

మునుపటికన్నా ఇప్పుడతని మొహం మరీ పీక్కుపోయి ఉంది.

"గుడ్ మార్నింగ్! రండి, రండి" అంటూ తలుపు కడ్డం తొలిగాను.

అతను సోఫాలో చతికిలబడి, "మిస్టర్ సారథీ! రాత్రి జరిగిన సంఘటనతో నా మనసు పాడైపోయింది. ఇక్కడ ఒక్క క్షణంకూడా ఉండ బుద్ధికావడంలేదు. సాయంత్రం వెళ్ళే ప్లేన్‌లో కైరో వెళ్ళి అక్కడ కొన్నాళ్ళు గడపడానికి నిశ్చయించాను" అన్నాడు.

"నేనూ అదే నిర్ణయం తీసుకున్నాను. ఇక్కడ చూడదలచుకున్నవన్నీ దాదాపు నిన్ననే చూశాను. ఇక కైరో వెళ్ళి, అక్కడో వారంరోజులు గడపాలి. సాయంత్రం ఫ్లైట్‌లో ఇద్దరం కలిసే వెళదాం మరి!" అన్నాను.

అతను తలూపి, వెళ్ళిపోయాడు.

ఏర్‌పోర్టుకు ఫోన్ చేసి, సాయంత్రం కైరో వెళ్ళే ప్లేన్‌లో నా సీట్ రిజర్వ్ చేసుకున్నాను. తెల్లవారుజాము

వరకూ, పోలీసుల హడావుడితో సతమతమైనందువల్ల నిద్ర పూర్తి కాలేదు.

అందుకే, మధ్యాహ్నం భోజనం కానిచ్చి, పక్క మీద వాలాను.

నాలుగ్గంటలవరకూ నిద్రపోయి, బాత్ రూంలో దూరి ఫ్రెష్ అయి వచ్చాను. అప్పుడు మోగింది కాలింగ్ బెల్. బహుశా, ఓంప్రకాశ్ అయుంటాడనుకుంటూ వెళ్ళి తలుపు తీశాను.

అతను ఓంప్రకాశ్ కాదు! ఎవ్వడో అపరిచితుడు!!

"గుడీవినింగ్! సారధి మీరే అనుకుంటాను" అన్నాడు మర్యాదగా.

"ఔను. మీరు?"

"నన్ను స్టీవర్ట్ అంటారు. ఆంగ్లోయిండియన్ని! ప్రస్తుతం ఇక్కడే ఉంటున్నాను. మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి" అన్నాడతను వినయంగా.

తలూపి దారి ఇచ్చాను.

లోనికి వచ్చి, సోఫాలో కూర్చున్నాడు. తలుపు దగ్గరగా వేసి, అతని కెదురుగా కూర్చున్నాను.

"మీరు ఢిల్లీనించి వచ్చారు కదూ ఇక్కడికి?"

తలూపాను. ఆ వివరాలు హోటల్ రిజిస్టర్‌లో రాసి ఉన్నాయి.

"ఢిల్లీలో మండోదరి అనే యువతి మీతో కళ్ళజోడిచ్చింది కదూ?"

పక్కలలో పిడుగుపడ్డట్టు అదిరిపడ్డాను. "ఆ విషయం మీకెలా తెలుసు?"

"చెబుతాను. ముందిది చూడండి" అంటూ కోటు

జేబులోంచి ఓ వస్తువు తీశాడతను.

దాన్ని చూడగానే నా కళ్ళు విప్పారాయి.

.32 కాలిబర్ పిస్తోలు అది!

దానిముందు సైలెన్సర్ గొట్టం బిగించి ఉంది. దాన్ని సూటిగా నావైపు గురిపెట్టి—"మిస్టర్ సారథీ! పిచ్చి వేషాలువేసి ప్రయోజనం వుండదు. నా చూపుడువేలు ట్రిగ్గర్ని వత్తిన మరుక్షణం నీవు పైలోకంలో ఉంటావ్. బుద్ధిగా నేను చెప్పినట్టు విను" అన్నాడతను చాలా నింపాదిగా.

"ఏం కావాలి నీకు?"

"కళ్ళజోడు! మండోదరి ఢిల్లీలో నీకిచ్చిన కళ్ళజోడు కావాలి. అది నీ దగ్గరున్నంతకాలం నీ ప్రాణాలకి ముప్పు తప్పదు. ఇంతవరకూ నీవు సజీవంగా యెలా ఉన్నావో నాకే అర్థం కావడంలేదు! వాళ్ళు నిన్ను చంపేసి ఎక్కడ ఆ కళ్ళజోడు కాజేశారో అని భయపడ్డాను. నీవు బ్రతికుండటం నా అదృష్టం! మర్యాదగా దాన్ని నా కిచ్చెయ్."

"దాంట్లో ఏముందని ఇలా దేవిళ్ళాడుతున్నావ్? పోలీసులు దాన్ని లేబొరేటరీలో క్షుణ్ణంగా పరీక్ష చేశారు. ఎక్స్‌రేకూడా తీసి చూశారు. అందులో ఏమీ లేదని రూఢి అయింది...దాన్ని కైరోలో ఉన్న తన మిత్రుడికందజెయ్యమని నా కిచ్చింది మండోదరి..."

"కావచ్చు!ఇప్పుడామె ఈ లోకంలో లేదు.కైరోలో ముక్కూ మొహం తెలియని వ్యక్తికోసం దేనికి తంటాలు పడతావ్? ఆ కళ్ళజోడుని లేబొరేటరీలో పరీక్ష చేశారన్నావుగా? అది మామూలు కళ్ళజోడేనని ధృవపడిందన్నావుగా? ఇంకేం, ఇచ్చెయ్! దాన్ని ఇంతదూరం మోసుకొచ్చినందుకు ప్రతిఫలంగా మూడువేల డాలర్లు

చెల్లిస్తాను!"

నాకు నవ్వాగలేదు. "మిస్టర్ స్టీవర్ట్! అందులో నిజంగా ఏమీ లేకుంటే, మీరిన్ని అవస్థలు దేనికి పడుతున్నారు? పిస్తోలు చూపి నన్ను బెదిరించడానికి? డబ్బిస్తానని బేరం దేనికి? అంటే, అది మూడు వేల డాలర్ల కన్నా ఎక్కువ ఖరీదు చేస్తుందన్నమాట!"

"మాటలతో కాలయాపనం చెయ్యక! డబ్బు తీసుకుని రభస లేకుండా ఇస్తావా? లేక, నిన్ను రక్తపు మడుగులో పడేసి, ఖర్చు లేకుండా నన్నే తీసుకోమంటావా?" అన్నాడతను అసహనంగా.

"పోలీస్ నిపుణులకూ కూడా అర్థం కాకుండా, అందులో దాగున్న రహస్య మేమిటో తెలుసుకోనిదే ఎవ్వరికీ దాన్నివ్వదలచుకోలేదు" అన్నాను దృఢంగా.

స్టీవర్ట్ సోఫాలోంచి లేచాడు. "ఈ భూమ్మీద నీకు నూకలు చెల్లిపోయాయనుకుంటాను. అందుకే ఇలా పేలుతున్నావ్. ఆల్ రైట్! చావు మూడినప్పుడు ఎవ్వడేం చేస్తాడు?" అంటూ చెయ్యి ముందుకి చాపి, సరిగ్గా నా నుదుటికి గురిపెట్టాడు పిస్తోలు.

అంతే!

తలుపు తెరుచుకోవడం, "ఢాం!" మన్న శబ్దం కావడం, స్టీవర్ట్ కెవ్వుమనడం, అరక్షణంలో జరిగిపోయాయి. అతని చేతిలోని పిస్తోలు ఎగిరి కిందపడింది. ఆ చేతిలోంచి బొటబొట కారుతోంది రక్తం!

నివ్వెరపోతూ తలుపు వేపు చూశాను.

ఓంప్రకాశ్!

అతని చేతిలో పొగలు కక్కుతున్న పిస్తోలు!!

నేనటు చూసిన ఆ రెప్పపాటు వ్యవధిలో, మెరుపులా బాల్కనీవైపు ఉరికాడు స్టీవర్ట్! నేను సోఫాలోంచి లేచేలోగా ఎగిరి బాల్కనీపక్క నీటిగొట్టం అందుకుని కిందికి జారసాగాడు.

నేనూ, ఓంప్రకాశ్ అటు పరిగెత్తి, కిందికి చూశాం. మసక చీకటి. అప్పటికే అతను సగందూరం జారిపోయాడు. ఆటువంటి పనుల్లో వాడు రాటుదేలిన పిండం అయుంటాడు.

ఓంప్రకాశ్ చివరి ప్రయత్నంగా పిస్తోలు కిందికి గురిపెట్టి కాల్చాడు. చీకట్లో గురి తప్పింది. ఆలోగా స్టీవర్ట్ అదృశ్యమయ్యాడు.

"మిస్టర్ ఓంప్రకాశ్! మీరు సమయానికి వచ్చి కాపాడకుంటే, నేనీపాటికి శవరూపంలో ఉండేవాణ్ణి. మీ ఋణం మాటలతో తీర్చుకోలేనిది" అన్నాను కృతజ్ఞతగా.

"ఎవ్వరతను? మీ మీద దేనికి దౌర్జన్యం చెయ్యబోయాడు. అదృష్టవశాత్తూ తలుపు దగ్గరగా వేసుంది కనక సరిపోయింది. గడియపెట్టుంటే నేనేమీ చెయ్యలేక పోయేవాణ్ణి.

కైరో ప్రయాణానికి మీరు రెడీ అయ్యారా లేదా అని వచ్చాను మీ గదికి. లోపల ఎవ్వరో వాదించుకున్నట్టు వినిపించి, కీ హోల్లోంచి చూశాను. అప్పుడు తెలిసింది అసలు సంగతి..." అన్నాడు ఓంప్రకాశ్.

"వాడెవ్వడో నాకు తెలీదు! చాలా ముఖ్య విషయం మాట్లాడాలంటే లోనికి రానిచ్చాను. పిస్తోలు చూపి

ఉన్నదంతా ఊడ్చిపెట్టమని బెదిరించాడు ..అదృష్ట వశాత్తూ మీరు రాబట్టి సరిపోయింది" అన్నాను అసలు విషయం చెప్పకుండా.

"ఇది చాలా మంచి హోటలనుకున్నాను. దొంగలకూ, ఖూనీకోర్లకూ ఆలవాలమని ఊహించలేదు... ప్రయాణానికి మీరు సిద్ధంగా ఉన్నారా?"

తలూపాను.

ఆరుగంటలకి హోటల్ ఖాళీచేసి, సామానుతో ఏర్ పోర్టు చేరాం.

ఆ కళ్ళజోడు నా కోటు లోపలి జేబులో భద్రంగా ఉంది!

# 7

కొన్ని ముఖ్య నగరాల్లో ఆగుతూ, ఎగురుతూ మర్నాడు మధ్యాహ్నం మూడుగంటలకు కైరో చేరింది మా విమానం!

టాక్సీలో తిన్నగా 'ముర్రాదున్' అనే హోటల్ చేరుకుని, చెరో సింగిల్ రూం తీసుకున్నాం. టాక్సీ బాడుగా, రూం ఎడ్వాన్సు పే జెయ్యగానే తెలిసి పోయింది, ఆ దేశంలో రేట్సు ఎంత విపరీతంగా ఉన్నాయో! ఏ యాత్రీకుడైనా నేరకపోయి అక్కడికి వచ్చాడంటే, నున్నగా తిరపతి క్షవరం కావల్సిందే!

కాసేపు ప్రయాణబడలిక తీర్చుకుని, సాయంత్రం ఐదుగంటల ప్రాంతంలో, టెలిఫోన్ డైరెక్టరీ తిర గేశాను. అమెరికన్ ఆయిల్ రిఫైన్ కంపెనీ నెంబర్ దొరికింది.

టీపాయ్‌మీద ఫోన్ ముందుకు లాక్కుని, రింగ్ చేశాను.

ఆపరేటర్ కంఠం వినిపించింది.

"మీ కంపెనీలో త్రిలోక్‌చంద్ అనే భారతీయ ఇంజనీర్ పని చేస్తున్నాడు. ఆయన చిరునామా కావాలి ప్లీజ్!" అన్నాను.

"ఒక్క నిమిషం ఆగండి. పెర్సనల్ మేనేజర్‌తో కనెక్టు చేస్తాను. ఆయనతో మాట్లాడండి" అంది ఆపరేటర్.

రెండునిమిషాల తరువాత ఓ గంభీరమైన కంఠం వినిపించింది.

"ఎస్, పర్సనల్ మేనేజర్ స్పీకింగ్!"

చెప్పాను త్రిలోక్‌చంద్ గురించి.

"ఉండండి. అపాయింట్‌మెంట్ ఆఫీస్‌లో వాకబ్ చేసి కనుక్కుంటాను" అన్నాడు.

పది నిమిషాల తరువాత వినిపించింది అతని కంఠం. "ప్రస్తుతం త్రిలోక్‌చంద్ డ్యూటీలో లేడు. నెలరోజులు సెలవు పెట్టాడు. కావలిస్తే అతని ఎడ్రస్ రాసుకోండి. హెచ్ నెంబర్ 3-1-146, నఫీస్ కాలొనీ!"

"థాంక్స్!" అంటూ రిసీవర్ దించాను.

త్రిలోక్‌చంద్ నెలరోజులు సెలవుపెట్టి ఎక్కడికెళ్ళాడు? ఇంట్లో రెస్టు తీసుకుంటున్నాడా? అనుకుంటూ లేచి, బట్టలు మార్చుకున్నాను.

ఆ ఆప్టికల్ కేస్ కోటు లోపలిజేబులో వేసుకుంటూ గదిలోంచి బైటికెళ్ళబోతుండగా, టెలిఫోన్ మోగింది! రిసీవర్ అందుకున్నాను.

"సారధిగారేనా?" వినిపించింది అవతలినించి, హిందీలో.

"ఔను! మీ రెవరు?"

"త్రిలోక్ చంద్ ని!"

"వెల్! నేను మీ దగ్గరికే బయలుదేరాను. మీ కంపెనీకి ఫోన్ శేస్తే తెలిసింది మీ చిరునామా. నే నిక్కడ బస చేసినట్టు ఎలా కనుక్కున్నారు?"

"మీ వెంట నా కళ్ళజోడు పంపిస్తున్నట్టు, ఢిల్లీనించి మండోదరి టెలిగ్రాం పంపింది నాకు. మీరు రోమ్‌లో కొన్నాళ్ళు గడిపి, ఇక్కడికి వస్తారనికూడా రాసింది. అందుకే, ఇక్కడి టూరిస్ట్ హోటల్ వాళ్ళకి మీ గురించి చెప్పి, మీరు రాగానే నాకు తెలీజెయ్యమన్నాను.

ఈరోజు మీరు 'ముర్రాదూన్' హోటల్లో దిగగానే, రిసెప్షనిస్టు నాకు ఫోన్ చేసి చెప్పాడు. ప్రస్తుతం నేను సెలవు పెట్టి, ఓ స్నేహితుడి ఇంట్లో ఉంటున్నాను.

మీరు సరాసరి ఇక్కడికే వచ్చి, ఈ రాత్రి మాతో కలిసి భోంచెయ్యాలి. ఎడ్రస్ గుర్తుంచుకోండి. ఫాతిమా స్ట్రీట్‌లో, ముస్తఫా మంజిల్ ఎక్కడని అడిగితే ఎవ్వరైనా చెబుతారు. మీకోసం ఎదురుచూస్తుంటాం!"

"ఓ. కే" అంటూ రిసీవర్ క్రెడిల్ చేశాను.

రూం లాక్ చేసి, హోటల్ బైటికి వచ్చాను. టాక్సీ వాడికి ఫాతిమా స్ట్రీట్ కెళ్ళమని చెప్పి ఎక్కాను.

పావుగంటలో చేర్చాడక్కడికి. బిల్ పే జేసి, వీధిలో పడి నడవసాగాను. దారినపోయే ఓ అరబ్బుని ఆపి, ముస్తఫా మంజిల్ గురించి అడిగాను.

కొద్దిదూరం వెళితే ఓ పసుపురంగు మేడ వస్తుందనీ, దాని కాంపౌండ్లో మూడు ఖర్జూరపుచెట్లు కనిపిస్తాయనీ చెప్పాడు. వడివడిగా అడుగులు వేశానటు.

మేడ కనిపించింది. కాంపౌండ్ గేటు మూసి ఉంది. లొ క్కంతీసి లోనికెళ్ళాను. ఇంటిబైట డిమ్‌లైట్ వెలుగుతోంది. ప్రవేశద్వారం మూసి ఉంది. కోటు జేబులోంచి ఆప్టికల్ కేస్ తీశాను.

నాకు ఫోన్ చేసింది నిజంగా త్రిలోక్ చందేనని రూఢి అయ్యేవరకూ ఆ కళ్ళజోడు వివ్వకూడదు. మూసివున్న తలుపుని సమీపించాను. మెట్ల కిరుప్రక్కలా చెట్ల కుండీలు పెట్టి ఉన్నాయి.

ఆప్టికల్ కేస్‌ని కుడిపక్క కుండీలో, మొక్కలమధ్య జారవిడిచాను. అది జాగ్రత్త! ఏ పుట్టలో ఏ పాముందో మరి? గుమ్మానికి కాలింగ్ బెల్ బిగించి ఉంది. నొక్కాను.

లోపలినించి ఎవ్వరో తలుపువైపు వస్తున్న అడుగుల ధ్వని. తలుపు తెరుచుకుంది. భారతీయుడిలా ఉన్న ఓ మధ్యవయస్కుడు కనిపించాడు.

"త్రిలోక్ చంద్ మీరేనా?" అడిగాను.

"కాదు. అతని స్నేహితుణ్ణి. నా పేరు బన్సీలాల్. మీరు సారథిగా రనుకుంటాను. రండి. లోనికి రండి" అన్నాడతను తలుపు కడ్డం తొలుగుతూ.

లోన అడుగుపెట్టాను.

అది హాలు. దాని పక్కనే మరో గది ఉంది.

ఆ గదిలోకి తీసుకెళ్ళి—"కూర్చోండి," అన్నాడతను.

"త్రిలోక్ చంద్ ఎక్కడ?" అడిగాను.

"లోపలున్నాడు. వస్తాడు. కూర్చోండి" అన్నాడు బన్సీలాల్.

కుర్చీలో నతికిలబడ్డాను.

అంతలో తలుపులకవతల ఎవ్వరో వస్తున్న అడుగుల చప్పుడు వినిపించింది.

మరుక్షణం ఓ వ్యక్తి ప్రవేశించాడు లోనికి. అతన్ని చూడగానే నెత్తిన పిడుగుపడ్డట్టు అదిరిపడ్డాను. అతనూ నన్ను చూసి, చటుక్కున గుమ్మంలోనే ఆగిపోయాడు.

"సారధిగారూ! అతనే త్రిలోక్ చంద్!" అన్నాడు బన్సీలాల్.

ఆశ్చర్యంతో నా నోరు తెరుచుకుంది. అత నెవ్వరో కాదు.

ప్రతాప్ సింగ్!

రోమ్‌లో, మండోదరిని హోటల్ గదిలో చంపి అదృశ్యమైన ప్రతాప్ సింగ్!!

సాలోచనగా తలూపాను. "మిస్టర్ త్రిలోక్ చంద్! రోమ్‌లో మీరు నన్ను ప్రతాప్ సింగ్ పేరుతో కలుసుకున్నారు. గుర్తుందా? అక్కడ మీరు కళ్ళజోడు లేకుండానే నా కళ్ళముందు తిరిగారు. బహుశా, ఇప్పుడా కళ్ళజోడు మీ కవసరం లేదనుకుంటాను."

బన్సీలాల్ తెల్లబోయాడు. ఐనా, తేరుకుని బలవంతపు నవ్వు నవ్వాడు.

"మిస్టర్ సారథీ! రోమ్‌లో త్రిలోక్ చంద్ ఏ పేరుతో మిమ్మల్ని కలుసుకున్నాడో నాకు తెలీదు. కాని, త్రిలోక్ చంద్ మాత్రం ఇతనే! మీ రా కళ్ళజోడు అతని కిచ్చేసి మాతో విందారగించి వెళ్ళండి!"

నా మొహం జేవురించింది. "ఇక మీరెన్ని ఎత్తులు వేసినా నే నమ్మను. ఇతను నిజంగా త్రిలోక్ చంద్ అయితే, రోమ్‌లో తన స్నేహితురాలిని, భారతదేశం

నించి ఆ కళ్ళజోడు నాతో పంపిన మండోదరిని దేనికి చంపేడు?'' నా వాక్యం ఇంకా పూర్తి కాలేదు.

బన్సీలాల్ చేతిలో మెరుపులా పిస్తోలు వచ్చేసింది. అతని పెదాలమీద నవ్వు మాయమైంది. "మిస్టర్ సారథ్! నీవు మాటలతో వినే ఘటంలా లేవు. నీలాటి వాళ్ళని ఎలా లొంగదియ్యాలో నాకు తెలుసు!'' అంటూ నాలిక మడిచి ఈల వేశాడు బన్సీలాల్.

మరుక్షణం ఓ గున్నఏనుగును పోలిన మనిషి వచ్చాడు గదిలోకి.

ఖడ్గమృగంలా మెలితిరిగిన కండలు, బోడిగుండు, పిల్లిగడ్డం!

"సిద్దీక్! ఊ...'' అన్నాడు బన్సీలాల్ నావైపు సైగ చేస్తూ.

ఆ పొట్టిపిండం నా వెనక్కి వచ్చి, రెండుచేతులూ వెనక్కి విరిచి పట్టుకున్నాడు. నెప్పికి మెలితిరిగి పోయాను.

"ప్రతాప్ సింగ్! వీడి దుస్తులు చెక్ చేసి, ఆ కళ్ళజోడు తీసుకో'' అన్నాడు బన్సీలాల్.

ప్రతాప్ సింగ్ ముందుకు వచ్చి, అంగుళం వదలకుండా నా బట్టలు వెదకసాగాడు. నా ముందుచూపే ఆ కళ్ళజోడును సురక్షితం చేసింది బైట.

ప్రతాప్ సింగ్ పెదవివిరిచి, "నో! దాన్ని తీసుకురా లేదు రాస్కెల్!'' అన్నాడు.

చిన్నగా నవ్వాను. "నేను మీరనుకున్నంత తెలివి తక్కువవాణ్ణి కాదు. మీ మీద పూర్తి నమ్మకం కుదరందే ఆ కళ్ళజో డివ్వకూడదని, దాన్నోచోట సురక్షితంగా దాచాను.''

"ఫరవాలేదు. ఆ చోటు కనుక్కోవడం మా కేమంత కష్టంకాదు. మర్యాదగా చెప్పు, ఎక్కడ దాచావ్ దాన్ని? లేదా, నిన్ను సిద్దీక్ కప్పగిస్తాను. మనుషుల పక్కటెముకలు విరగ్గొట్టడంలో వాడికి చాలా ఆనందం కలుగుతుంది" అన్నాడు బన్సీలాల్ పిస్తోలు ఊపుతూ.

"మీరొక విషయాన్ని విస్మరిస్తున్నారు. ఇక్కడిలాటి సంఘటనేదో జరుగుతుందని నాకు ముందే తెలుసు. అందుకే, గంటలోపల నేను తిరిగిరాని పక్షంలో ఈ ఇంటిమీద రైడ్ చెయ్యమని పోలీసులకి చెప్పొచ్చాను" అన్నాను చిద్విలాసం చేస్తూ.

బన్సీలాల్ ఆలోచనలో పడిపోయాడు. కాసేపు యోచించి తలెత్తాడు.

"ఆల్ రైట్! గోటితో పోయేదానికి గొడ్డలెందుకు? సంప్రదింపులతో రాజీ పడదాం! వెయ్యి డాలర్లిస్తాను. కళ్ళజో డిచ్చెయ్."

"ముందీ గొరిల్లాని నా చేతులు వదలమను."

బన్సీలాల్ స్థానిక భాషలో ఏదో అన్నాడు వాడితో. మరుక్షణం ఆ గున్నఏనుగు నా చేతులు విడిచి, బైటికెళ్ళిపోయాడు.

"మిస్టర్ సారథీ! ఆ కళ్ళజోడు నీ కెందుకూ పనికిరాదు. కష్టం లేకుండా వెయ్యి డాలర్లు వస్తుంటే వదులుకోవడం వివేకం కాదు," అన్నాడు నచ్చజెప్పే ధోరణిలో.

"మీ బేరం చాలా చిన్నది. స్టీవర్ట్ అనే ఆంగ్లోయిండియన్ ఇదివరకే మూడు వేలిస్తానన్నాడు."

స్టీవర్ట్ పేరు వినగానే బన్సీలాల్ ఉలిక్కిపడ్డాడు.

"ఆ రాస్కెల్ నిన్ను కలుసుకున్నాడా? మూడువేలకి వాడి కమ్మేశావా?"

"నో! నేను పదివేలు డిమాండ్ చేశాను. ఈ రోజు బేరం ఫిక్సయింది. ఈ రాత్రి పదిగంటలకి నా మనిషి ఓ నిర్ణీత ప్రదేశంలో దాన్ని తనకిచ్చి,డబ్బు తీసుకుంటాడు. నేను వెళితేనే ఇప్పుడా బేరం కేన్సిలవుతుంది!"

"అబద్ధం! నేనన్నమ్మను. నిజంగా నీ వగనితో ఒప్పందం కుదుర్చుకునుంటే ఇక్కడికెందుకొచ్చావ్? మర్యాదగా నిజం చెప్పు. కళ్ళజోడెక్కడుంది? నేను ఐదువరకూ లెక్కపెడతాను. ఆలోగా చెప్పకపోయావో నా పిస్తోలు గుళ్ళు నీ కాళ్ళలో దిగబడతాయి. ఆ బాధ భరించడం ఎంత కష్టమో నీకు బాగా తెలుసు. ఊ... ఒకటి... రెండు... మూడు..." లెక్కపెడుతున్నాడు బన్సీలాల్.

సరిగ్గా అదే సమయంలో బల్లమీది ఫోన్ మోగింది!

"ప్రతాప్‌సింగ్! ఎవ్వరో చూడు" అన్నాడు బన్సీలాల్.

ప్రతాప్‌సింగ్ ఫోన్ దగ్గరికెళ్ళి రిసీవ రందుకున్నాడు. కాసేపు ఏదో మాట్లాడి మా వైపు తిరిగాడు. అతని మొహంలో ఆశ్చర్యం!

"బన్సీలాల్! ఇతను చెప్పింది నిజమే. స్టీవర్ట్ ఫోన్ చేశాడు. కళ్ళజోడు అతని దగ్గరుందిట. అది మీకాకావాలనుకుంటే, రాత్రి పన్నెండుగంటల కతన్ని ప్లాజా హోటల్లో కలుసుకోమంటున్నాడు."

పిస్తోలు నావైపు గురిపెట్టివున్న బన్సీలాల్, ప్రతాప్ సింగ్ నోటినించి ఆ మాటలు వినగానే అతనివైపు

తిరిగాడు ఆశ్చర్యంతో!

ఆమాత్రం వ్యవధి చాలు నాకు. సోఫాలోంచి స్ప్రింగ్‌లా ఎగిరి ఒక్క తన్ను తన్నాను అతని చేతి మీద. పిస్తోలు ఎగిరి అవతల పడింది. ఆ షాక్‌లోంచి బన్సీలాల్ తేరుకోకముందే, అరచేతి అంచుతో శక్తికొద్దీ కరాటే వేటు వేశాను అతని మెడమీద.

మొదలునరికిన చెట్టులా కింద కూలాడు!

దిగ్భ్రాంతితో ఈ దృశ్యం చూస్తున్న ప్రతాప్ సింగ్ తేరుకుని, బన్సీలాల్ చేతిలోంచి కిందపడ్డ పిస్తోలు అందుకోబోయాడు. అతనికా అవకాశం ఇవ్వకుండా మెరుపులా ఎగిరి ఒక్క ఫ్లయింగ్ కిక్ ఇచ్చాను ఛాతీ మీద!

గావుకేక పెడుతూ కిందకూలాడు!

అలా ఒక్క నిమిషంలో వాళ్ళిద్దరూ నా ముందు స్పృహతప్పి పడున్నారిప్పుడు.

గబగబ తలుపువైపు నడిచాను. తలుపు దాటబోతుండగా, ఖడ్గమృగంలా తలవంచి, బోడిగుండుతో నన్ను కుమ్మడానికి బాణంలా దూసుకు వస్తూ కనిపించాడు సిద్దిక్!

చటుక్కున పక్కకి తప్పుకున్నాను. వాడు అదే వేగంలో తిన్నగా గదిలోకి దూసుకుపోయాడు. మెరుపులా తలుపు మూసి ఇవతల గడియ బిగించాను.

ఒకే ఒక విషయం నా కర్థంకావడంలేదు. స్టీవర్ట్ వాళ్ళకి ఫోన్ చేసి, కళ్ళ్యాడు తనదగ్గరుందని దేనికి చెప్పాడు? రోమ్‌లో మా చేత గాయపడి పారిపోయిన వ్యక్తి కైరో కెలా వచ్చాడు? మమ్మల్ని వెంబడించాడా?

అంతా అయోమయంగా ఉంది. దీన్నిబట్టి ఆ కళ్ళజోడుకోసం నలుగురైదుగురు వ్యక్తులు విడివిడిగా ప్రయత్నిస్తున్నారని స్పష్టమౌతోంది. ఎవరికివారు, అది మరొకరికి దక్కకుండా నా నుంచి కాజెయ్యడానికి చూస్తున్నారు.

ఏదిఏమైనా స్టీవర్ట్ సమయానికి ఫోన్ చేసినందువల్ల లోలోన అతన్ని అభినందిస్తూ ఆఇంట్లోంచి బైటపడ్డాను. మెట్లపక్క పూలతొట్టిలో దాచిన కళ్ళజోడందుకుని, కోటు లోపలి జేబులో వేస్తూ వడివడిగా వీధిలోకి వచ్చాను.

కనిపించిన టాక్సీ ఎక్కి, పావుగంటలో హోటల్ చేరుకున్నాను. ఇక ఆ కళ్ళజోడు నాదగ్గిరుండటం ప్రమాదం! రేపు స్థానిక బ్యాంక్ లాకర్లో దాన్ని దాచెయ్యాలి.

# 8

ఉదయం కాలకృత్యాలు తీర్చుకుని, సరిగ్గా పదిన్నరకు 'నేషనల్ బ్యాంక్ ఆఫ్ కైరో' వెళ్ళాను. ఆ బ్యాంకు లాకర్లో కళ్ళజోడు భద్రంచేసి, రసీదు తీసుకుని, ఓ ఆప్టికల్ షాపులో దూరాను.

షోకేసుల్లో రకరకాల కళ్ళజోడు ఫ్రేమ్స్ అమర్చి ఉన్నాయి. వాటిని జాగ్రత్తగా పరిశీలించి, సరిగ్గా అటువంటిదే ఓ ఫ్రేమ్ ఎన్నుకున్నాను.

షాపతనికి దాన్ని చూపెట్టి—"ఇందులో బాగా లావుపాటి గ్లాసెస్ బిగించండి" అన్నాను.

"నెంబర్స్ చెప్పండి."

"ఏ నెంబరైనా సరే. గ్లాసులు మాత్రం బాగా లావుండాలి."

అతను నావైపు ఎగాదిగా చూసి, గ్లాసెస్ తెరిచి ఉన్న ఓ లెదర్ కేస్ తెరిచి నా ముందుంచాడు. వాటిలో సరిగ్గా ఆ కళ్ళజోడుని పోలివున్న అద్దాలు ఏరి అతని కిచ్చాను.

పావుగంటలో తయారయింది కళ్ళజోడు!

బిల్ పేచేసి, తిరిగి హోటల్ చేరుకున్నాను. గదిలో అడుగు పెడుతుండగా టెలిఫోన్ మోగింది.

రిసీవర్ అందుకుని "సారథ స్పీకింగ్!" అన్నాను.

"నేనయ్యా ముఖర్జీని! మన దేశనించి ఇప్పుడే కైరో చేరాను. ఏర్‌పోర్టునుంచి మాట్లాడుతున్నాను. అర్జంటుగా నిన్ను కలుసుకోవాలి. హోటల్లో ఉన్నావో లేవోనని ఫోన్ చేశాను" అవతల మా సి. బి. ఐ. డైరెక్టర్ గారి కంఠం విని నిర్ఘాంతపోయాను.

ఆయన నాకోసం భారతదేశంనించి వచ్చారంటే, అదేదో తీవ్ర విషయమే అయ్యుంటుంది. "వెంటనే బైలుదేరి రండి సార్!" అన్నాను.

అవతల డిస్కనెక్ట్ అయింది. రిసీవర్ దించి సిగరెట్ అంటించాను.

అరగంటలో వచ్చారు ముఖర్జీ.

"ఢిల్లీనించి నీకోసం, రోమ్ పోలీసులద్వారా వాకబ్ జేయిస్తే, కైరో వెళ్ళిపోయావని తెలిసింది. వెంటనే బైలుదేరి వచ్చానిక్కడికి. ఇప్పుడు చెప్పు. ఢిల్లీనించి నీవు బైలుదేరినప్పట్నించీ ఇంతవరకూ జరిగిన సంఘటనలు?" అన్నారాయన సోఫాలో కూర్చోగానే.

అంతవరకూ జరిగిందంతా క్రమబద్ధంగా ఆయనకి వినిపించి, "ఇప్పుడు చెప్పండి మీ రాకలోని మర్మం ఏమిటి?" అన్నాను.

ఆయన ప్రారంభించారు. "బహుశా, నీకు జ్ఞాపకం ఉందో, లేదో? రెండేళ్ళ క్రితం మన దేశంలోని ఉదయపూర్ మహారాజా ఇంట్లో పెద్ద దోపిడీ జరిగింది. నలుగురైదుగురు సభ్యులుగల ముఠా కలిసి చేసిన దోపిడీ అది.

అందులో ఎంతో విలువైన వజ్రాభరణాలు దొంగిలించబడ్డాయి. వాటి ఖరీదు సుమారు కోటి రూపాయలుంటుందని అంచనా వేశారు. ఆ ముఠాకోసం పోలీసులు నిద్రాహారాలు మాని శ్రమించారు. ఫలితం లేకపోయింది. కాని, ఈమధ్యే ఆ ముఠా నాయకుడి రాత బాగోలేక ఓ విచిత్ర సంఘటన జరిగింది. అప్పుడే పోలీసులకి వాళ్ళ చరిత్ర తెలిసింది!

వివరంగా చెబుతా విను. ఆ ముఠాకు నాయకత్వం వహించినవాడి పేరు రంజిత్! దోపిడీ జరిగాక, ఆ వజ్రాభరణాలని తక్షణం అమ్మడం ప్రమాదం గనక, వాటి సెక్యూరైనా పాతేసి, కేసు పెండింగ్‌లో పడ్డాక వెలికి తీసి పంచుకుందామనుకున్నారు ముఠా సభ్యులు.

వాటిని దాచే పూచి రంజిత్‌కే అప్పగించారు. రంజిత్, ఆ ఆభరణాలని రాజస్థాన్‌లో ఉన్న థార్ ఎడారిలో దాచి, ఆ ప్రదేశాన్ని గుర్తుంచుకోడానికి మ్యాప్ తయారు చేసి తనదగ్గర పెట్టుకున్నాడు. అతనికో ప్రియురాలుండేది. ఆమె పేరే మండోదరి!

ఇక అసలు విషయానికి వస్తున్నాను. పదిహేనురోజుల క్రితం ఢిల్లీలో, ఓ ట్రాఫిక్ రోడ్ దాటబోతూ, ఓ కారు కింద పడి తీవ్రంగా గాయపడ్డాడు రంజిత్! వెంటనే అతన్ని హాస్పిటల్లో చేర్చారు. తన ఇంటి చిరునామా చెప్పి మండోదరిని పిలిపించమని కోరాడు రంజిత్.

ఆమె వచ్చాక, అతను కేవలం పదిగంటలు ప్రాణా లతో ఉండగలిగాడు హాస్పిటల్లో. ఆ వ్యవధిలో అతను తన ప్రియురాలికి ఆ కళ్ళజోడిచ్చి, దాన్ని సురక్షితంగా కైరోలోని 'అమెరికన్ ఆయిల్ రిఫైజ్ కంపెనీ'లో పని చేస్తున్న తన తమ్ముడి కందజేయమని కోరాడు. అతని తమ్ముడే త్రిలోక్ చంద్!

ఇక్కడ గమనించవలసిన విషయం ఏమిటంటే' అతను ప్రాణాలు విడుస్తూ ఒక మామూలు కళ్ళజోడును' ఎక్కడో కైరోలో ఉన్న తన తమ్ముడి కివ్వమని ఇచ్చాడంటే, థార్ ఎడారిలో అతను దాచిన ఆ వజ్రాభరణాల ప్రదేశం తాలూకు మ్యాపు అందులోనే ఉండిఉంటుందని పోలీసుల అనుమానం!"

"కానీ, ఇన్‌స్పెక్టర్ అలెగ్జాండర్ దాన్ని అన్ని విధాలా పరీక్ష జేయించి, ఏ రహస్యమూ లేదని చెప్పాడే!" అన్నాను ఆశ్చర్యంగా.

"కావచ్చు! రంజిత్ కంటికి కనిపించని కిటుకేదో కనిపెట్టి, అందులో దాచుంటాడు. అతనితమ్ముడు త్రిలోక్ చంద్ ఇంజనీర్ కదా, అందులో దాగున్న రహస్యాన్ని తనంత తానే కనుక్కోగలడని ఊహించి ఉంటాడు.

హాస్పిటల్లో రంజిత్ చనిపోవడంతో, అతని ముఠా వాళ్ళు బెంబేలు పడిపోయారు. కారణం, ఆ నిధి దాచిన చోటు అతనికి తప్ప మరెవ్వరికీ తెలీదు. అతను మండో దరి కిచ్చిన కళ్ళజోడులోనే అది దాగిన రహస్యం ఉండి ఉంటుందని వాళ్ళు పసిగట్టుంటారు.

మరుక్షణం మండోదరిని మట్టుపెట్టి, కళ్ళజోడు చేజిక్కించుకోడానికి ఎవరికి తోచినట్టు వాళ్ళు ప్రయ

త్నించసాగారు. మండోదరి ప్రమాదాన్ని పసిగట్టి, దాన్ని నీకప్పజెప్పి, వెంటనే ఇక్కడున్న త్రిలోక్ చంద్ కు టెలిగ్రాం పంపింది!"

"ఐతే, నా ఇంటి కాంపౌండ్ లో మండోదరి శవం దొరకడం, ఆ తరువాత ఆమె రోమ్ లోని హోటల్ గదిలో హత్య చెయ్యబడటం, యీ మిస్టరీ ఏమిటి...?" అడిగాను.

"అదే చెప్పబోతున్నా విను! మండోదరికి ఢిల్లీలో ఓ చెల్లెలుండేది. వాళ్ళిద్దరికీ చాలా పోలికలుండేవి. కళ్ళ జోడు నీకివ్వడానికి వచ్చినప్పుడు తోడుగా తన చెల్లెల్ని కూడా వెంటబెట్టుకొచ్చింది. చెల్లెల్ని బైటనిల్చోబెట్టి, నిన్ను కలుసుకుంది.

ఐతే, వాళ్ళని వెంబడిస్తూ, నీ ఇంటివరకు వచ్చిన రంజిత్ ముఠాసభ్యుల్లో ఒకడు, బైటవున్న ఆమె చెల్లెల్ని ఆమే అనుకుని పిస్తోలుతో కాల్చి, కళ్ళజోడుకోసం వేనిటీ బ్యాగ్ వెదికాడు. అది కనిపించకపోయేసరికి శవాన్ని నీ కాంపౌండ్లో పడేసి పారిపోయాడు.

కళ్ళజోడు నీకిచ్చినట్లు యిచ్చి, నీ వెనకే మరో విమానంలో రోమ్ చేరివుంటుంది మండోదరి. నీ ఫారిన్ ప్రోగ్రామ్స్ ఆమెతో చెప్పావు గనక, నిన్ను రహస్యంగా వెంబడిస్తూ కైరో చేరాలని ఆమె ప్లాన్!

ప్రతాప్ సింగ్, బన్సీలాల్, స్టీవర్ట్ ఆ ముఠాసభ్యులే అయుంటారు. ప్రతాప్ సింగ్ ఢిల్లీనించి నిన్ను ఫాలో చేస్తూ రోమ్ చేరివుంటాడు. అదేవిధంగా అక్కడికెళ్ళిన మండోదరి, హోటల్లో ప్రతాప్ సింగ్ కంట బడుంటుంది. అతనామెని చంపి, గదిలోంచి జారుకునుంటాడు.

తరవాత, నీకు దూరంగా ఉండి, ఫాలో చేస్తూ కైరో వచ్చుంటాడు. అంటే, అప్పుడే మురాసభ్యులు ముగ్గురూ ఇక్కడే పొంచివున్నారన్న మాట! ఇప్పుడు మనం వాళ్ళ ఎత్తుకు పైఎత్తులు వేసి, చిత్తుచేసి భారతదేశం లాక్కెళ్ళాలి!'' అంటూ ముగించారు ముఖర్జీ.

తలూపాను. "ముందు మీరు కాస్త రెస్టుతీసుకోండి. సాయంత్రం తీరిగ్గా కూర్చుని పథకం అల్లుదాం!''

"ఔను! పక్కవాటాలో నా కోసం ఓ గది బుక్ చేసుకునే నీ దగ్గరికి వచ్చాను. నా రూం నంబర్ 226. సాయంత్రం కలుసుకుందాం!'' అని వెళ్ళిపోయారాయన.

అప్పుడు తట్టింది నాకు! త్రిలోక్ చంద్ యింటి చిరునామా నా దగ్గరుంది.

వెళ్ళి చూస్తే?

వెంటనే బైలుదేరాను టాక్సీలో.

నఫీస్ కాలనీలో అతనిల్లు కనుక్కోవడం ఏమంత కష్టంకాలేదు.

ఇంటితలుపుకి తాళంకప్ప వేళాడుతోంది!

ఏమయ్యాడు త్రిలోక్ చంద్?

నిరుత్సాహంతో తిరిగి హోటల్ చేరాను. అప్పటికే చీకటి పడింది. హోటల్లో లైట్లు వెలుగుతున్నాయి. లిఫ్ట్ ఎక్కి పైకెళ్ళాను.

గది లాక్ తెరిచి లోన అడుగు పెట్టాను.

# 9

"వెల్ కమ్ మిస్టర్ సారథీ! వెల్ కమ్!'' అన్న కంఠం విని ఉలిక్కిపడ్డాను.

గదిమధ్య సోఫాలో కూర్చునున్నాడు బన్సీలాల్.

అతని పక్కనే సిద్దిక్, ప్రతాప్ సింగ్ నిల్చున్నారు.

వాళ్ళ చేతుల్లో నల్లగా నిగనిగ మెరుస్తున్నాయి పిస్తోళ్ళు!

"ఇక మానించి నీవు తప్పించుకోడం కల్ల! ఆ కళ్ళజోడెక్కడ?" అంటున్నాడు బన్సీలాల్.

సాలోచనగా తలూపి, "నా జేబులో వుంది" అన్నాను.

"సిద్దిక్! వెనకనించి వెళ్ళి వాడి జేబులు వెదుకు" అన్నాడు బన్సీలాల్.

"చేతులెత్తి బుద్ధిగా నిల్చో! ఏ మాత్రం పిచ్చివేషాలు వేసినా, పిస్తోలుగుండు తిన్నగా నీ బుర్రలో తిష్టవేస్తుంది జాగ్రత్త!" అన్నాడు ప్రతాప్ సింగ్ ట్రిగ్గర్ మీద వేలు పెడుతూ.

చేతులెత్తాను!

సిద్దిక్ నా వెనక్కి వచ్చి, కోటులోపలి జేబులో వున్న అప్టికల్ కేస్ బైటికి తీశాడు. దాన్ని చూడగానే బన్సీలాల్, ప్రతాప్ సింగ్ కళ్ళు తళతళమన్నాయి.

"ప్రతాప్! దాన్ని టెస్ట్ చెయ్!" అన్నాడు బన్సీలాల్.

సిద్దిక్ చేతిలోంచి అప్టికల్ కేస్ అందుకున్నాడు ప్రతాప్ సింగ్. కేస్ తెరిచి, కళ్ళజోడు బైటికి తీశాడు. తరవాత తనపాంటు జేబులోంచి ఆప్టీషియన్స్ ఉపయోగించే లెన్స్ మెజర్ సాధనం తీశాడు.

ఐదు నిముషాలవరకూ కళ్ళద్దాలని అటూఇటూ తిప్పుతూ లెన్స్ మెజర్‌తో పరీక్ష జేసి "ఇది ఆ కళ్ళజోడు కాదు!" అన్నాడు ఖంగారుగా.

బన్సీలాల్ నన్ను ఉరిమి చూసి "కళ్ళజోడు మార్చేశావన్నమాట" అన్నాడు.

"మండోదరి ఢిల్లీలో నాకిచ్చిన కళ్ళజోడు ఇదే!" అన్నాను నటిస్తూ.

"వీడిలా విస్ఫోటనం కాదు! వీణ్ణి మన సిద్దిక్ కప్పగించామంటే అరనిమిషంలో కక్కేస్తాడు అసలు విషయం!" అన్నాడు ప్రతాప్ సింగ్ పళ్ళు నూరుతూ.

బన్సీలాల్ సిద్దిక్ వైపు సైగ చేశాడు.

ఆ ఖడ్గమృగం నా వైపు కదలబోయాడు అంతే!

"ఢాం! ఢాం! ఢాం!" అన్న ప్రేలుళ్ళతో గది మారు మోగింది.

బన్సీలాల్, ప్రతాప్ సింగ్ చేతుల్లోని రివాల్వర్స్ ఎగిరిపోయాయి. సిద్దిక్ జబ్బపట్టుకుని మూలుగుతూ కింద పడ్డాడు.

ఆ హఠాత్సంఘటనకు దిమ్మెరబోయి అటు చూశాను.

బాల్కనీగుండా లోనికి వస్తూ కనిపించాడు ఓంప్రకాష్!

అతని చేతిలో పొగలు కక్కుతున్న పిస్తోలు!!

"మిస్టర్ ఓంప్రకాష్! రెండుసార్లు ఆపద్బాంధవుడిలా వచ్చి నన్ను కాపాడారు. మీ ఋణం ఎలా తీర్చుకోను?" అన్నాను కృతజ్ఞతగా.

"ఆ కళ్ళజోడిచ్చి తీర్చుకోండి."

అప్పుడే, ప్రతాప్ సింగ్ ఓంప్రకాశ్ వైపు చూసి అదిరిపడి — "త్రిలోక్ చంద్ నువ్వా!?" అన్నాడు దిగ్భ్రాంతితో.

"ఇతను త్రిలోక్ చందా?" అన్నాను నివ్వెరబోతూ.

"ఔను. రంజత్ తమ్ముడు, త్రిలోక్ చంద్ వీడే!" అరిచాడు బన్సీలాల్.

అయోమయంతో నా బుర్ర పని చెయ్యడం మానేసింది కాసేపు.

"మిస్టర్ సారధీ! మీరా కళ్ళజోడును బ్యాంక్ లాకర్లో దాచారని నాకు తెలుసు.

దాన్ని మీద్వారా సురక్షితంగా ఇక్కడికి చేర్చాలనే, రోమ్ నుండి నేను నీడలా మిమ్మల్ని వెంబడిస్తున్నాను. మా అన్న చనిపోతూ దాన్ని నాకప్పగించమని మండోదరి కిచ్చాడు.

తనచుట్టూ ప్రమాదాలు పొంచి ఉన్నవని పసిగట్టి, మండోదరి దాన్ని మీ చేతికిచ్చింది. మీ వివరాలు తెల్పుతూ నాకు టెలిగ్రాం పంపింది. నేను ఒంటరివాణ్ణి, పైగా క్షయరోగిని. ఈ జిత్తులమారి నక్కలను ఒంటరిగా ఎదుర్కోలేను.

అందుకే, అజ్ఞాతంగా ఉంటూ, మిమ్మల్ని ఫాలో కావాలని రోమ్ చేరుకున్నాను. మీతో పరిచయం సంపాదించుకున్నాను. అక్కడ ఆ కళ్ళజోడు స్టీవర్ట్ చేతిలో పడకుండా సమయానికి మిమ్మల్ని ఆదుకున్నాను.

మనిద్దరం కలిసి కైరో వచ్చాక, వీళ్ళు మిమ్మల్ని త్రిలోక్ చంద్ పేరుతో ఫోన్ చేసి, తమ స్థావరానికి పిలిపించుకున్నారు. అక్కడ వీళ్ళకి స్టీవర్ట్ పేరుతో ఫోన్ చేసింది నేనే!

ఏది ఏమైనా ఇప్పుడా కళ్ళజోడు నా సొత్తు!" అంటూ జేబులోంచి ఓ తెల్లకాగితం, కలం తీసి నావైపు విసిరాడు ఓంప్రకాశ్, ఉర్ఫ్ త్రిలోక్ చంద్.

"ఆ కాగితంమీద, బ్యాంక్ లాకర్లో నీవు దాచిన ఆ కళ్ళ జోడును నా కివ్వవలసిందిగా, బ్యాంక్ మేనేజర్ పేర ఉత్తరం రాసి, రసీదుతోబాటు నా కివ్వు. ఆ బ్యాంక్‌లో నా ఎకౌంట్ ఉంది. మేనేజర్‌కి నేను పరిచితుణ్ణి. త్వరగా చెప్పినట్టు చెయ్!" ఆజ్ఞాపించాడు త్రిలోక్ చంద్.

ఆలోచిస్తున్నాను.

"చెప్పినట్టు చేస్తావా? చస్తావా?" అరిచాడు త్రిలోక్ చంద్.

కాగితం, కలం అందుకోడానికి వంగాను. అంతే!

"ఢాం! ఢాం" మనే శబ్దంతో గది గింగురుమంది.

త్రిలోక్‌చంద్ గావుకేక!

నివ్వెరబోతూ తలెత్తాను.

బాల్కనీగుండా లోనికి వస్తూ కనిపించారు ముఖర్జీ!

త్రిలోక్‌చంద్ కుడిచేతి మణికట్టునించీ, ఎడంచేతి భుజంనించీ రక్తం ధారలుగా కారుతోంది!

"ఎలా వచ్చారిక్కడికి?" అడిగాను ఆశ్చర్యంగా.

ఆయన నవ్వి "నిన్ను కలుసుకుందామని, అవతలినించి నీ గదిని సమీపించాను. అప్పుడే, లోపల రివాల్వర్ పేలిన చప్పుడు వినిపించింది. వెంటనే హోటల్ బైటికెళ్ళి, నీటి గొట్టంద్వారా బాల్కనీలో దిగాను" అన్నారు.

గబగబ ఫోన్ దగ్గరికెళ్ళి స్థానిక పోలీసులకి కబురు చేశాను.

హుటాహుటిన వచ్చారు వాళ్ళు.

ముఖర్జీగారు భారత సి. బి. ఐ డైరెక్టర్‌గా తనని వాళ్ళకి పరిచయం చేసుకుని, ఆ దోషుల్ని తాత్కాలిక కస్టడీకోసం వారివెంట పంపేశారు.

అప్పుడు ముగిసింది ఆ కళ్ళజోడు గందరగోళం!

రేపు దాన్ని బ్యాంక్ లాకర్లోంచి తీసి, ముఖర్జీగారి కప్పగించాలి.

# 10

"మిస్టర్ సారథీ! ఈ కళ్ళజోడులో ఏ రహస్యమూ దాచే అవకాశం కనిపించడంలేదు. దీని ఫ్రేం చాలా సామాన్యమైంది. రహస్య అరలాటిదేమీ లేదు. మరి ఆ నిధి రహస్యం ఎక్కడుంది?" అడిగారు ముఖర్జీ, ఆ కళ్ళ జోడుని తీక్ష్ణంగా పరిశీలిస్తూ.

చిన్నగా నవ్వాను. "గత రాత్రి ప్రతాప్ సింగ్ ఆ నకిలీ కళ్ళజోడును లెన్స్ మెజర్ ఇన్స్ట్రుమెంట్ తో పరీక్ష జరిపినప్పుడే నాకందులోని మర్మమేమిటో అర్థమైంది.

ఆ ముఠా నాయకుడు రంజిత్, అత్యంత తెలివితేట లతో సరికొత్త పద్ధతిలో ఆ నిక్షేపాన్ని కనుగొనే సంకేతాన్ని పొందుపరిచాడిందులో.

భూమిని సర్వే చెయ్యడానికి ట్రిగ్నోమీటర్ అనే యంత్రం వాడబడుతుందని మీకు తెలిసిందేకదా? రంజిత్ ఆ ట్రిగ్నోమీటర్ తోనే, ఎడారి ప్రారంభ ప్రదేశంనించి ఏదో ఒక చిహ్నాన్ని ఎంచుకుని, అక్కడినించి కొన్ని ఫర్లాంగులు, లేదా, కొన్ని మైళ్ళ దూరంలో ఎడారిమధ్య ఆ వజ్రాభరణాలు పాతేశాడు!

వాటిని మళ్ళీ తియ్యాలనుకున్నప్పుడు, ట్రిగ్నోమీటర్ సహాయంతో దిశనూ, దూరాన్నీ కొలిచి, అవి ఉన్న ప్రదేశం కనుగొని సునాయాసంగా తవ్వి తీసుకోవచ్చు.

ఈ రహస్యం తనకి తప్ప మరో ప్రాణికి తెలీకుండా

వుంచాలని, అతను ట్రిగ్నోమీటర్ నీడిల్స్ స్థిరంగానిచ్చే అంకెలనే, కళ్ళద్దాల నెంబర్లుగా మార్చి, కళ్ళజోడు తయారుచేయించాడు.

ఇప్పుడీ కళ్ళజోడు అద్దాలని ఆప్టికల్ లెన్స్ మెజర్‌తో చెకప్ చేయిస్తే వీటి నెంబర్లేమిటో తెలిసి పోతుంది. దానితో, ఎడారిలో ఆ నిధి ఎక్కడ పాతి వుందో కనుక్కోవచ్చు!'' అన్నాను పూర్తయిన సిగరెట్‌ని ఏష్ట్రేలో నొక్కుతూ.

—: ఐపోయింది :—

# ముష్టికుక్క

## వసుంధర

జానకిరామయ్య కళ్ళు తెరవగానే "రఘు వచ్చాడా?" అనడిగాడు.

గోపీ మౌనంగా తలవంచుకున్నాడు.

"కాసేపు మీరు ఏమీ ఆలోచించకండి. విశ్రాంతి మీకు చాలా అవసరం" అన్నాడు డాక్టర్. బదులుగా విషాదంగా నవ్వాడు జానకిరామయ్య.

జానకిరామయ్య ఆ ఊళ్ళో సంపన్న గృహస్థు. రెండు సంవత్సరాల క్రితం ఆయన భార్యపోయింది. ఆయనకిద్దరే కొడుకులు. పెద్దవాడు గోపీ. అతని వయస్సు ఇరవై రెండేళ్ళు. రెండోవాడు రఘు అతనికంటె ఏణ్ణర్థం చిన్న.

గోపీకీ, రఘుకీ వయసులో అట్టే తేడాలేకపోయినా ప్రవర్తనలోనూ గుణగుణాల్లోనూ చాలా భేదముంది. గోపీ తెలివైనవాడు. చురుకైనవాడు. మచ్చుకైనా దురలవాట్లు లేనివాడు. వినయం అతనికి భూషణం. తండ్రి వ్యాపార వ్యవహారాలన్నీ అతనే చూసుకుంటున్నాడు.

రఘుకు ఇంటి ధ్యాసలేదు. అతనికి చదువు సరిగ్గా అబ్బలేదు. తల్లి చేసిన గారాబం చాలావరకూ అతన్ని పాడుచేసింది. అన్నగారన్నా, తండ్రి అన్నా అతనికి లక్ష్యంలేదు. అతని స్నేహితులందరూ వ్యసనపరులు. అయితే వాళ్ళందరూ ఊళ్ళో పెద్దమనుష్యులుగా చెలామణీ అవుతున్నవారి బంధువులు. విలాసాలపట్ల రఘుకు చాలా మోజుంది.

జానకిరామయ్యకు గోపీ గురించిన చింతలేదు. రఘు ఏమైపోతాడో అన్నది ఆయన బెంగ. గోపీ మంచితనం గురించికూడా ఆయనకు బాగా తెలుసు. ఆ మంచితనాన్ని అలుసుగా తీసుకుని రఘు గోపీకూడా అన్యాయం చేస్తాడేమోనని ఆయన అనుమానం. గోపీ ఎన్ని పర్యాయాలో తండ్రికి ధైర్యం చెప్పిచూశాడు.

"నాన్నా! మీరు తమ్ముడిగురించి బెంగపెట్టుకోవద్దు. వాడికి నేనేలోటూ రానివ్వను. వాడు మారతాడన్న విశ్వాసం నాకుంది. మీరు మీ మనసును అదుపులో ఉంచుకుంటేతప్ప మీ ఆరోగ్యం బాగుపడదు" అంటూండేవాడు గోపీ.

మనసును అదుపులో వుంచుకోవాలని మహామహులే ప్రయత్నించి విఫలులయ్యారు. జానకిరామయ్య సామా

న్యాడు. అదాయనవల్ల కాలేదు. మందులేవీ ఆయనకు పని చేయడంలేదు. భార్యపోయేక ఆయన మంచం పడ్డాడు. నానాటికీ క్షీణించిపోతున్నాడు.

నిన్నటిదినం ఆయనకు గుండెల్లో పెద్దపోటు వచ్చి స్పృహ తప్పింది. అంతా అయిపోయిందనే అనుకున్నారు కానీ గండం గడిచింది. సుమారు పధ్ధెనిమి గంటల అనంతరం ఆయనకు స్పృహవచ్చి కళ్లు తెరిచాడు.

కళ్ళు తెరవగానే రెండో కొడుకు గురించి అడిగాడాయన. కానీ సమాధానం ఆయనకు నిరుత్సాహాన్ని కలిగించింది. ఏ పనీలేని రెండోకొడుకు పధ్ధెనిమిది గంటలపాటు బయటకు వెళ్ళిపోయాడు. అంతసేపు వాడిని బయట ఉంచగలిగిన వ్యాపకాలేమిటి?

ఈ ప్రశ్నకు సమాధానం జానకిరామయ్యకు తెలిసి వుండకపోతే ఏబాధా లేదు. తెలియడమే ఆయన మనస్సుకూ, ఆరోగ్యానికీ శాపమైంది.

గోపి రఘుకోసం చాలా ప్రయత్నాలు చేసివుంటాడనీ అదేమీ ఫలించి ఉండవనీకూడా జానకిరామయ్యకు తెలుసు. తన అనారోగ్యం సంగతి తెలిసికూడా కొడుకు నిర్లక్ష్యం చేశాడేమోనన్న అనుమాన మొకటి ఆయన్ను వేధిస్తోంది.

"గోపీ–వాడెక్కడికెళ్ళాడో తెలుసుకుందుకు ప్రయత్నించలేదా నువ్వు?"

"ప్రయత్నించాను .."

"తెలియలేదా?"

"లేదు..."

"అబద్ధమాడకు. వాడి ఆచూకీ నీకు తెలిసే వుంటుంది వాడు రానివుంటాడు..."

గోపీ క్షణం తటపటాయించాడు. తండ్రి చెప్పింది నిజమే! కానీ ఈ నిజాన్ని చెప్పడంవల్ల కలిగే ప్రయోజనమేముంది? నిజానికి రఘు ఆ సమయంలో పేకాటలో వున్నాడుట. ఎన్ని చెప్పినా, ఆఖరికి తండ్రి ఆరోగ్యం గురించి చెప్పినా వినకుండా కసిరి పొమ్మన్నాడుట.

"అలా ఎందుకంటాడు? కబురు తెలిసివుంటే తప్పక వచ్చివుండేవాడు" అన్నాడు గోపీ చివరకు.

జవాబివ్వడానికి గోపీ క్షణం తటపటాయించడంలోనే జానకిరామయ్యకు విషయం అర్థమైపోయింది. ఆయన ముఖం గంభీరంగా అయిపోయింది. "గోపీ! నా దగ్గర నిజం దాచకు. నిజంగా నువ్వు రఘు శ్రేయస్సు కోరేవాడివయితే వాడిని బాగుచేసే విధానమిదికాదు. ముందుగా వాడిగురించిన నిజాలన్నీ నాకు చెప్పు. మనమిద్దరం కలిసి వాడిని బాగుచేసే పథకం వేద్దాం. అదంత కష్టం కాదు. కానీ నువ్వు చెప్పే అబద్ధాలు వాడిని ఇంకా పతనం కావడానికి ప్రోత్సహిస్తాయి."

"మీకు విశ్రాంతి అవసరం..." అన్నాడు డాక్టర్.

"డాక్టరుగారూ-విశ్రాంతి తీసుకుని ఏంచేయను? కన్నకొడుకు కళ్ళముందే పతనమైపోతూంటే చూస్తూ ఎలా ఊరుకోను? వాడు బాగుపడినపుడే నాకు విశ్రాంతి. వాడిని బాగుచేయడంకోసం ఆ ఆరోగ్యం దెబ్బతిన్నా ఫరవాలేదు..." అన్నాడు జానకిరామయ్య.

## 2

"నీకు సుందరి అని ఎవరు పేరుపెట్టారోకానీ-చాలా కరెక్ట్‌గా పెట్టారు!" అన్నాడు రఘు.

"ఇంకెవరు పెడతారు? అమ్మా-నాన్నా" కిసుక్కున నవ్వింది సుందరి.

"నీకు అమ్మా, నాన్నా కూడా తెలుసునా?" అన్నాడు రఘు.

సుందరి ముఖం చిన్నబోయింది. ఆమెకు నిజంగానే చరిత్ర లేదు. తలిదండ్రులెవ్వరో తెలియదు. అది నిజమే అయినప్పటికీ ఆమెకా నిజాన్ని వినడం ఇష్టముండదు. ఎందుకంటే ఆ నిజానికి బాధ్యత ఆమెది కాదు. కానీ ఆమె ప్రవర్తనకు సంబంధించిన ఇంకో నిజం_ఆమెను గురించి ఎవరైనా అంతమాట అనడానికి దోహదం చేసింది. అయితే ఆమె దగ్గరకు వచ్చే అందరూ ఈ నిజాన్ని ఆమెముందు అని_తద్వారా ఆమె అందించే ఆనందంలో కొంతభాగానికి దూరంకారు.

రఘుకుమాత్రం అటువంటి బాధలు లేవు. డబ్బుతో ఏమైనా చేయవచ్చునని అతని ఉద్దేశ్యం. పంతంపట్టి తను అనుకున్నవి సాధించగలడతను.

ఎదుటి వ్యక్తులను మాటలతో హీనపర్చడం అతని హాబీ. వాళ్ళు బాధపడుతూంటే చూసి వినోదిస్తాడతను. అతనికి అవసరమైన ఆనందం సుందరి అతనికిస్తోంది. అయినా ఆమెపట్ల అతనికి కృతజ్ఞత లేదు. ఆమె తనకిచ్చే ఆనందం కేవలం తన డబ్బు కారణంగా అని అతనికి తెలుసును. శారీరకమైన ఆనందాన్ని పొందుతూనే చూనసికంగా హింసిస్తూంటాడతనామెను. అందువల్ల సుందరిలో అతనంటే క్రమంగా ద్వేషం పేరుకుపోసాగింది.

"ఎందుకు అస్తమానూ_అలా అని నన్ను హింసిస్తారు?

అమ్మా నాన్నా తెలిస్తేనేం తెలియకపోతేనేం_నేనే మీకు అవసరమౌతున్నానుకదా. నాతో కలిసి ఆనందం పంచుకుంటున్న మనమిద్దరమూ ఒకే రకంవాళ్ళం అవుతాం'' అంది సుందరి.

రఘు కళ్ళు ఎర్రబడ్డాయి. తృణీకారాన్నతను సహించడు. ''సుందరీ నీకూ నాకూ పోలికేమిటి? నేను ఇచ్చేవాణ్ని. నువ్వు పుచ్చుకునేదానివి...''

''అవుననుకోండి. నేను పుచ్చుకునేదాన్నే. కానీ ఊరికే ఏమీ పుచ్చుకోవడంలేదు. నాకు డబ్బిచ్చినందుకు ప్రతిఫలంగా ఆనందాన్నిస్తున్నాను. కానీ మీరు ఇచ్చే డబ్బు మీరు సంపాదించింది కాదు. ఎవరో సంపాదించిన డబ్బు మీకోసం వాడుకుని ఆనందిస్తున్నారు...''

''అమ్మా నాన్నా లేనిదానివి. అందుకని నీకు తప్పదు. నాకేం అవసరం?''

''తన అవసరానికి తను సంపాదించుకోని మగవాడు మగవాడు కాదు'' అంది సుందరి.

''ఎంత ధైర్యం నీకు?'' అన్నాడు రఘు కోపంగా.

''సమానానికికూడా మిలిఉంటుంది రఘుబాబూ_ఇదే మీకూ నాకూ ఆఖరి కలయిక, ఇక సెలవ్'' అంటూ లేచింది సుందరి.

''ఆగు...'' అన్నాడు రఘు. అతని కంఠస్వరంలోని తీవ్రతకు భయపడింది సుందరి. ''ఈ రోజు నీలో ఒకకొత్తరకం వినోదం పొందదలిచాను. ప్రతిఫలం ఎంతో తెలుసా? ఒక్క రోజుకు అయిదు వేలు. ఒప్పుకుంటావా?''

సుందరి తడబడింది. ఒక్కరోజుకు అయిదువేలు! సిగ్గుఎగ్గులు వదిలిపెట్టిన స్త్రీ తను. కేవలం డబ్బుకోసం అన్నీ వదిలిపెట్టింది. ఇప్పుడా డబ్బు పెద్దమొత్తంలో తరుముకు వస్తుంటే ఎందుకు కాదనాలి?

"కాదనవద్దు. ఇందులో నీకు శారీరకంగా ఏవిధమైన హింసా వుండదు" అన్నాడు రఘు. సుందరి కోపం ఎగిరిపోయింది. రఘులాంటి బంగారు పిచ్చుకను అనవసరంగా ఆవేశపడి చెడగొట్టుకోకూడదని గ్రహించిందామె.

ఆమె అంగీకారాన్ని వింటూనే రఘు చాలా మందికి అప్పటికప్పుడు టెలిఫోన్ చేశాడు. అతను తగ్గుస్వరంలో ఏం మాట్లాడేడో ఆమెకు తెలియలేదు. ఆ సంభాషణల్లో కొన్ని కోడ్ వర్డ్సుకూడా వున్నాయి.

అంతా అయేక "పద-మనం-వీర్రాజు ఇంటికి వెళుతున్నాం" అన్నాడు.

అరగంటలో వీర్రాజు ఇంట్లో ఒక చిన్న గదిలో వీర్రాజూ, రఘూ సుందరీ సమావేశమయ్యారు. సుందరిని దూరంగా కూర్చోమని మిత్రులిద్దరూ చర్చలు ప్రారంభించారు.

"అంతా వచ్చేరా?"

"అఁహాల్లో వున్నారు."

"కార్పెట్లు పరిచారా?"

"అహాఁ" అన్నాడు వీర్రాజు.

"అయితే మీ పక్కను తీసుకురా" అన్నాడు రఘు.

వీర్రాజు వెళ్ళి అయిదునిముషాల్లో తిరిగివచ్చాడు. అతనితోపాటు ఒక వృద్ధకాయుడు-ముసలి ఆల్సేషియన్

కుక్కతో వచ్చాడు. అతని చేతిలో ఇంకో గొలుసు వుంది.

రఘు ఆ కుక్కను ప్రేమగా నిమిరాడు. అదతనికి పరిచయమైనదే కాబోలు-బౌబౌ అంది పలకరింపుగా.

దృఢకాయుడి చేతిలోవున్న రెండో గొలుసు తీసుకున్నాడు రఘు. నెమ్మదిగా సుందరిని సమీపించి "అయిదువేల విషయంలో ఏ మోసమూ లేదు అనుమానించనక్కర్లేదు" అన్నాడు.

"మీ మీద నాకేవిధమైన అనుమానమూ లేదు" అంది సుందరి. లోపల మాత్రం ఈ కిరాతకుడి ఉద్దేశ్యం ఏమైవుంటుందా అని భయపడుతూనే వుంది.

"శారీరకంగా నిన్ను హింసించడం జరగదు" అన్నాడు రఘు.

"అది మీరు ఇందాకా చెప్పారు" అంది సుందరి.

"ఓకే...అయితే బట్టలు విప్పు" అన్నాడు రఘు.

సుందరి చుట్టూ చూసింది. ఒక అల్సేషియన్, ముగ్గురు మగవాళ్ళు వున్నారు. ఆ క్షణంలో ఆ నలుగురూ ఒక్కటేననిపించిందామెకు. "ఎందుకు?"

"ఎందుకేమిటి? నువ్వు కుక్కవి. కుక్కలు బట్టలు ధరించవు" అన్నాడు రఘు.

సుందరి ముఖం ఎర్రబడింది. "మీరు మాట తప్పారు. నన్ను హింసించనని చెప్పారు. హింసించడానికి సిద్ధంగా వున్నారు. నాకు అయిదు వేలూ అక్కర్లేదు..."

"నిన్ను శారీరకంగా హింసించడం జరగదని చెప్పాను. నేను మాటంటే మాటే."

"నాకు అయిదు వేలూ అక్కర్లేదు. సెలవిప్పించండి" అంది సుందరి.

"ఒకసారి ఒప్పుకున్నావు వెళ్ళిపోతానంటే కుదరదు" అని_"వీర్రాజూ నువ్వు వెళ్ళి నేను చెప్పింది చేయి... మేము వచ్చేస్తున్నాం" అన్నాడు రఘు. వీర్రాజు వెళ్ళిపోయాడు.

రఘు దృఢకాయుడికేసి చూసి సౌంజ్ఞ చేశాడు. దృఢకాయుడి నడుముకు పటకా బెల్టు వుంది. అతను దాన్ని విప్పుతున్నాడు.

"సుందరీ! శారీరకంగా నిన్ను హింసించడం జరగదని చెప్పాను. కానీ నేను చెప్పినట్లు చేయడానికి ఒప్పించడానికి నిన్ను హింసించక తప్పదనిపిస్తోంది" అన్నాడు రఘు.

సుందరికి పరిస్థితి అర్థంకావచ్చింది. రఘు కిరాతకుడు. ఒళ్ళు తాటలు తేలేలా కొట్టించగలడు. ఆమె మారు మాట్లాడకుండా బట్టలు విప్పేసింది. రఘు తనవద్దనున్న గొలుసు ఆమె మెడలో తగిలించాడు. మోకాళ్ళమీద పాకమని చెప్పాడు. అప్పుడప్పుడు భౌభౌ అంటూ ఉండాలని చెప్పాడు.

ఇప్పుడు రఘు రెండు చేతుల్లోనూ రెండు గొలుసులున్నాయి, ఒక్క గొలుసు ఆల్సేషియన్‌ది, రెండవది సుందరిది. అతను నడవడం మొదలుపెట్టాడు. కుక్క చలాకీగా నడుస్తోంది. సుందరి పాకుతోంది. మధ్య మధ్యలో భౌభౌ అంటోంది. ఆమె కళ్ళలో నీళ్ళున్నాయి. అవెవరికీ కావాలి?

వాళ్ళలా రెండు గదులు దాటినాక ఒక గది గుమ్మం దగ్గర "ఫ్రెండ్స్ ఇప్పుడు మన స్నేహితుడు రఘు ఇక్కడికి రెండు కుక్కలతో వస్తున్నాడు. అందులో ఒకటి

నాకెంతో ప్రియమైన టామీ. రెండవది-అపూర్వమైనది. మీ కళ్ళతో మీరే చూసి వినోదించాలి'' అన్న అనౌన్స్‌మెంట్ వినిపించింది. ఆ కంఠం వీర్రాజుది దృఢకాయుడు రఘు వెనకాల ఉన్నాడు. అతను తన పటకా బెల్టునో పర్యాయం సుతారంగా సుందరి వీపుపై కదిలించి హెచ్చరించాడు.

తలుపులు తెరుచుకున్నాయి.

అదో హాలు. ఆ హాల్లో సుమారు పాతికమంది మగవాళ్ళున్నారు. వారంతా రఘు మిత్రబృందం. అపూర్వమైన ఆ దృశ్యాన్ని చూసి అందరూ ఆశ్చర్యానందాలతో చప్పట్లు కొట్టారు.

కుక్కతోటీ, సుందరితోటీ రఘు కాసేపు ఆ హాల్లో అటూ ఇటూ విహారం చేశాడు. రెండు కుక్కల్నీ పోలుస్తూ చాలామంది చాలా కామెంట్సు చేశారు.

సుందరి కుక్కలా ప్రవర్తించడానికి దృఢకాయుడు మధ్యమధ్యలో సున్నితంగా ఆమెను హెచ్చరిస్తూనే ఉన్నాడు. అందువల్ల ఆ హాల్లో ఉన్నంతసేపూ ఆమె కుక్కలాగే నడిచింది. కుక్కలాగే అరిచింది. అక్కడున్న అందరూ అందుకు విపరీతంగా సంతోషించారు. మనిషిలా ఆమె కార్చే కన్నీళ్ళను ఏ ఒక్కరూ పట్టించుకోలేదు.

తన కళ్ళముందు జరిగే అవమానాల్ని సహించింది సుందరి. అలా అరగంటసేపు వినోదించిన తర్వాత ఆమెకు లెక్కపెట్టి అయిదువేలూ ఇచ్చి ''గొలుసు విప్పేవరకూ ఈ డబ్బును నోటితో కరిచిపెట్టుకుని ఉంచుకో''అన్నాడు రఘు.

ఆమెకు విముక్తి ఎప్పటికి లభించిందో కానీ అనుకో

కుండా వీర్రాజు తలుపు తట్టడంతో అది కాస్త దగ్గర పడిందనే అనుకోవచ్చు.

"ఎందుకు?" అన్నాడు రఘు చిరాగ్గా.

"మీ అన్నయ్య వచ్చాడు..."

"లేడని చెప్పలేకపోయావా?"

"చెప్పవలసిందే కానీ— మీ నాన్నగారి పరిస్థితి చాలా చాలా దయనీయంగా ఉందట. ఆయన వీలునామా వ్రాయబోతున్నారుట. నువ్వు వెడితే నీ ఇష్టం పాటించి వీలునామా వ్రాయడం జరుగుతుందిట. లేకపోతే మీ నాన్నగారూ, మీ అన్నయ్యా కలిసి వీలునామా రూపొందిస్తారుట..." అన్నాడు వీర్రాజు.

రఘుకి లేవక తప్పలేదు. అతను తలుపులుతీసి "ఎక్కడున్నాడు అన్నయ్య?" అన్నాడు. వీర్రాజు చెప్పాడు. "అయితే నువ్వీ కుక్క సంగతి చూడు" అని అతను వెళ్ళిపోయాడు.

## 3

"నువ్వు తెలివితక్కువ పని చేశావేమో ననిపిస్తోంది బ్రదర్. వ్యాపారంలో నువ్వుకూడా ఎంతో కొంత భాగం అడిగి ఉండాల్సింది" అన్నాడు వీర్రాజు.

"ఎందుకని?" అన్నాడు రఘు.

"వ్యాపారం వద్దు. అంతా క్యాషుకావాలని అడిగావు. నీ వాటాకి రమారమి నాలుగు లక్షలు వచ్చింది. కూర్చుని తింటున్నావు. జల్సాగా ఖర్చుచేస్తున్నావు. ఆరు నెలల్లో రెండు లక్షలు ఖర్చుపెట్టేశావ్. మిగతాదికూడా అయిపోతే ఏం చేద్దామని?" అన్నాడు వీర్రాజు.

"అంతదూరం ఆలోచించలేదు. ఈ వేళ గురించే కానీ రేపటి గురించి ఆలోచించడం నాకలవాటు లేదు. ఇంత

కాలం మా నాన్నగారిస్తూంటే పుచ్చుకు ఖర్చుచేసేవాణ్ణి. ఇప్పుడు నాదంటూ ఆస్తి ఏర్పడింది. నిజమే_ఇది ఖర్చయి పోతే ఏం చేయాలి?'' సాలోచనగా అన్నాడు రఘు.

''నువ్వు తెలివి తక్కువ పని చేశావ్. వ్యాపారంలో భాగం అడిగి కొంతకాలంపాటు మీ అన్నయ్యనే నీ వ్యవహారాలు చూడమనవలసింది. కూర్చుని తింటే కొండలైనా కరిగిపోతాయి కానీ వ్యాపారంలో అయితే_అప్పుడే మీ అన్నయ్య ఈ ఆర్నెల్లలోనూ లక్షపైగా లాభం తీశాడని వినికిడి'' అన్నాడు వీర్రాజు.

''అప్పట్లో అంతదూరం ఆలోచించలేదు. వ్యాపారం అనగానే భయం పుట్టింది. ఇప్పుడింక వ్యాపారంలో వాటా అడిగినా అన్నయ్య ఇవ్వడు.''

''అలాగనకు. మీ అన్నయ్య చాలా మంచివాడు.''

''అవుననుకో. కానీ నా దగ్గర రెండు లక్షలున్నాయని తెలిస్తే అవి ఇచ్చి భాగం తీసుకోమంటాడు. ముష్టాడికిలా నెలనెలా ఏ పదివేలో ఇస్తాడేమో అవి మన ఖర్చులకి చాలవుగదా.''

వీర్రాజు క్షణం ఆలోచించి ''ఒక ఉపాయముంది. తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభాలొచ్చే వ్యాపారం చేసేవాళ్ళలో కోదండం నాకు బాగా తెలుసు. మా నాన్న డియస్పీ కదా. వాళ్ళందరికీ మా అవసరం చాలా వుంది. నువ్వొక లక్ష రూపాయలిచ్చావంటే కోదండం నిన్ను భాగస్థుడిగా చేసుకోవడమే కాక నెలకు ముప్పై నలభై వేలు ముట్టజెప్పగలడు'' అన్నాడు.

''అదెలా సాధ్యం?''

''కోదండం వ్యాపారం తిన్నగానైనది కాదు. అతనికి

చాలా దొంగ వ్యాపారాలున్నాయి. మనలాంటి వాళ్ళు సాయం చేస్తారంటే అతను ఎగిరి గంతేసి మరీ ఒప్పుకుంటాడు. ఎట్టొచ్చీ మనం అతనిక్రింద తొత్తులంకాకుండా సమాన ఫాయీలో ఉండగలందులకుగాను ఓ లక్ష రూపాయలు పారేసి భాగస్వాములమైపోదాం.''

"ఈ ఆలోచన చాలా బాగుంది'' అన్నాడు రఘు ఉత్సాహంగా.

## 4

"నాకేమీ అభ్యంతరం లేదుకానీ ఒక్క మనవి. మీరిచ్చే లక్షరూపాయలూ వ్యాపారానికి పెట్టుబడిగా కాక వ్యవహారానికి సెక్యూరిటీ డిపాజిట్ గా ఉంచుతాను. మీరు డిపాజిట్ చేసి వెళ్ళిపోతే మీకేమీ డబ్బురాదు. వ్యాపారం గురించి కొంత సమయాన్ని వెచ్చించాలి. చేకూరిన లాభాలలో వాటా ఉంటుంది మీకు'' అన్నాడు కోదండం.

"నెలకేమాత్రం లాభాలొస్తాయ్?'' అన్నాడు రఘు.

"అది మీ స్వార్థ్యాన్నిబట్టి వుంటుంది. అసలేమీ ఉండకపోవచ్చు. అయిదారు లక్షలైనా ఆశ్చర్యముండక పోవచ్చు.''

రఘు కళ్ళు మెరిశాయి "ఏమాత్రం శ్రమపడవలసి ఉంటుంది మేము?''

"వారానికో రెండ్రోజులుకూడా ఉండదేమో?'' అన్నాడు కోదండం.

"మేమేం చేయాల్సి ఉంటుంది?''

"దొంగ సరుకు రవాణా విషయంలో అజమాయిషీ చేయాలి. సక్రమంగా జరిగితే లక్షలలో లాభం. సక్ర

మంగా జరక్కపోతే లక్షలలో నష్టం. లాభంలోనూ నష్టంలోనూ కూడా మీకు వాటా ఉంటుంది" అన్నాడు కోదండం.

"సరే బాగానే వుంది..." అన్నాడు వీర్రాజు సంతృప్తిగా.

సరిగ్గా అదే సమయంలో అక్కడికో పదనిమిదేళ్ళ యువతి వచ్చింది. పచ్చని ఛాయలో మిసమిసలాడిపోతోందామె. ఆమెను చూస్తూనే మిత్రులిద్దరికీ కనురెప్పలు మూతపడలేదు.

"నా చెల్లెలు అరుణ" అన్నాడు కోదండం.

ముగ్గురూ పరస్పరం నమస్కారాలు చేసుకున్నాక అరుణ ఆ గదిలోని అల్మరాలోంచి తనక్కావలసిన వస్తువేదో తీసుకుని వెళ్ళిపోయింది.

అక్కణ్నించి బయటపడ్డాక_"వాటే బ్యూటీ..." అన్నాడు రఘు.

"అవును కానీ ఆమె మన భాగస్థుడి చెల్లెలు..." అన్నాడు వీర్రాజు.

"అందుకే__ఉపాయం ఆలోచించాలి..." అన్నాడు రఘు.

# 5

"వాడింక బాగుపడడు" అన్నాడు జానకి రామయ్య.

"అలా ఎందుకనుకుంటారు నాన్నా? చేతిలో ఉన్నది తరిగిపోతూంటే వాడికి డబ్బు విలువ తప్పక తెలిసొస్తుంది" అన్నాడు గోపీ.

"లేదురా గోపీ_నాకిది మనోవ్యాధిగా పరిణమించింది. నీకు అన్యాయం జరక్కూడదనే ఆస్తిని విభజించేశాను

నేను. లేకపోతే వాడి ఖర్చుల జోరుకి మనమాగలేము. తన ఆస్తి చేతికివస్తే వాడికి బాధ్యత తెలుస్తుందేమోనని ఆశపడ్డాను. కానీ వాడికీ బాధ్యతకూ అమడదూరం. వాడి చేతిలో ఎంతో శ్రమించి నేను కూడబెట్టిన ఆస్తి-హారతి కర్పూరంలా హారించుకుపోతోంది. ఎప్పుడో ఒక రోజున వాడు నా కళ్ళముందే దేహీ అంటూ నలుగురినీ యాచించుకునే స్థితి రానున్నది. ఆ దృశ్యం నా కళ్ళపడే లోగా-ఈ కాయాన్ని భగవంతుడు తీసుకుపోతే బాగుం డును...'' అన్నాడు జానకిరామయ్య. విషాదంలో ఆయన కంఠం రుద్ధమైంది.

''నాన్నా - నేనుండగా రఘు అడుక్కుతినే పరిస్థితి ఎందుకేర్పడుతుంది?'' అన్నాడు గోపీ.

''నీకు తెలియదురా గోపీ - వాడిని గురించి నాకు పూర్తిగా తెలుసు. వాడు పరమదురాత్ముడు. పచ్చిస్వార్థ పరుడు. మహాబద్ధకస్తుడు. ఈ మూడు లక్షణాలూ కలిగిన వాడు ఎప్పటికైనా అడుక్కోక తప్పదు. అలాంటివాడిని కనికరిస్తే-ఆ కనికరించినవాడుకూడా అడుక్కు తినాల్సొ స్తుంది.''

''నాన్నా-వాడికి పెళ్ళిచేస్తే బాగుపడతాడేమో.''

''వాడికి తెలిసి తెలిసి పిల్ల నెవరిస్తార్రా?'' అన్నాడు జానకిరామయ్య. అన్నాడు కానీ ఆయనక్కూడా కాస్త ఆశ కలిగింది. ఎవరి అదృష్ట మెలాగుంటుందో చెప్పడం కష్టం. పెళ్ళి చేస్తే-ఆ పిల్ల తెలివైనదైతే రఘునుతనదారికి మళ్ళించుకుని అతన్ని మళ్ళీ మనిషిని చేయగలదేమో! ఆ విధంగా ఒక ఆడపిల్ల జీవితం నాశనమైపోయే అవకాశ ముందని తెలిసినా-విషయాన్ని ఆకోణంనుంచి ఆలోచించ డానికి జానకి రామయ్య తండ్రి మనసు అంగీకరించలేదు.

"నేను ప్రయత్నాలు చేస్తాను. వాడికి మాత్రం ఏం తక్కువ? వయసుంది, అందముంది, ఆస్తిపరుడు, అవలక్షణాలంటారా — వయసులో అవి చాలామందికి సహజం" ఆరిందాలా అన్నాడు గోపీ.

రఘుకు పెళ్ళికావాలంటే గోపీకూడా సంబంధాలు చూడాలని స్ఫురించింది జానకిరామయ్యకు. ఇప్పుడిప్పుడే వ్యాపార వ్యవహారాల్లో సెటిలౌతున్న గోపీ వివాహం ఇంకా ఒకటి రెండు సంవత్సరాలు వాయిదా వేస్తే బాగుండునని ఆయన అనుకున్నాడు కానీ-అగమ్మ కాకిలా తిరిగే చిన్నకొడుకు గురించి గోపీ పెళ్ళికూడా త్వరలోనే జరిపించాలని ఆయన అనుకున్నాడు.

తన పెళ్ళివిషయం తండ్రికి స్ఫురింపజేయడానికే గోపీ రఘు పెళ్ళి ప్రసక్తి తీసుకువచ్చాడని జానకిరామయ్యకు తెలియదు.

# 6

"నమస్కారమండి..." అన్నాడు రఘు.

అరుణ మనోహరంగా నవ్వి — "నమస్కారం. మీ పేరు రఘు కదూ" అంది.

"బాగా గుర్తించారు నా పేరు..." అన్నాడు రఘు ఆనందంగా.

"ఈ ఊరిలో మీరు కాస్త ప్రసిద్ధులే మరి..." అంది అరుణ.

రఘు చాతీ ఉబ్బింది — "మీతో పరిచయం నా అదృష్టం" అన్నాడు.

"అదృష్టం అనుకోవలసినంత పెద్ద పరిచయం మనకేముంది లెండి!" అంది అరుణ.

"అలా అనకండి. నా పేరు మీకూ గుర్తుంది. మీ రూపం నాలో నిలిచిపోయింది. ఇంతకంటే పెద్ద పరిచయం కావాలా?"

"చాలా బాగా చెప్పారు. మనకంతకంటే పెద్ద పరిచయం అనవసరం. వస్తాను" అంటూ కదిలింది అరుణ.

"నా ఉద్దేశ్యం అదికాదు. వెళ్ళిపోకండి. మీతో కొద్దిగ మాట్లాడాలి" అన్నాడు రఘు.

అరుణ ఆగి అసహనంగా పైకి చూసుకుని—"నాతో మాట్లాడాలంటే మా ఇంటికి రావచ్చు. ముందుగా అనుకుని మనమిక్కడ కలుసుకోలేదు. కాకతాళీయంగా కలుసుకున్నాం. కనిపించాంగదా అని ఏవో సంభాషణలు నడపాలని రూలులేదు" అంది.

రఘుకి ఏం మాట్లాడాలో తోచలేదు. ఒక్క నిముషం తటపటాయించి "మీ సంగతి నాకు తెలియదు కానీ నేను కావాలనే మిమ్మల్నిక్కడ కలుసుకున్నాను. మొదటిసారి మిమ్మల్ని చూసినప్పట్నించీ మీతో పరిచయం పెంచుకోవాలనిపించింది. ఈ రోజు కాలేజీ గేటు దగ్గర కాశాను. అక్కణ్నించీ మిమ్మల్ని ఫాలో అవుతూనే ఉన్నాను. అలా ఈ పార్కులోకి వచ్చాను. ఒంటరిగా వున్నారు కాబట్టి వెంటనే పలకరించాను..." అన్నాడు.

"పార్కులో నాకేమైనా పని ఉందేమో - ఇక్కడనే నెవరినైనా కలుసుకోవాల్సిందేమో— మీరు నన్ను అనవసరంగా డిస్టర్బ్ చేస్తున్నారేమో ఆలోచించేరా?" అంది అరుణ.

"మిమ్మల్ని చూస్తూంటే నాకింకే ఆలోచనలూ

రావడం లేదు. నేను చెప్పదల్చుకున్నది చెప్పేవరకూ మామూలు మనిషిని కాలేను..."

"అసలు మీరు చెప్పేది నేనెందుకు వినాలి?" అంది అరుణ.

'పిల్ల చాలా పెంకిఘటంలా ఉందే' అనుకున్నాడు రఘు. పైకిమాత్రం "మీ అన్నయ్యకు స్నేహితుణ్ని నేను. ఆ గౌరవంతోనైనా..."

అతనింకా ఏదో అనబోతూండగా "మీకు తెలియదేమో అన్నయ్య స్నేహితులంటే పరమ అసహ్యాం నాకు" అంది అరుణ.

రఘు దెబ్బతినేశాడు "ఎందుకని?"

"అన్నయ్య స్నేహితులంటే వాడి దొంగ వ్యాపారంలో భాగస్థులైనా అయుండాలి. అందుకు మద్దతునిచ్చే వారైనా అయుండాలి. అలాంటివారంటే నాకు చాలా అసహ్యాం."

రఘు క్షణం ఆలోచించి "చాలామంది చాలా రకాలుగా తప్పులు చేస్తూంటారు. వాళ్ళు చెడ్డవాళ్ళనే అనుకుందాం. మరి మంచివాళ్ళ డ్యూటీ వాళ్ళను అసహ్యాంచుకోవడమేనా? చెడ్డవాళ్ళని సంస్కరించడానికి ప్రయత్నించవద్దా?" అన్నాడు.

"దుష్టుడికి దూరంగా వుండమని శాస్త్రం చెబుతోంది."

రఘు చటుక్కున అనేశాడు "నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను అరుణా! జీవితంలో ఇంతవరకూ నేను తీసుకున్న మంచి నిర్ణయం ఇదొక్కటే నేమో–ఇంతవరకూ నా జీవిత విధానం ఏమైనా కావచ్చు. కానీ ఈ

క్షణంనుంచి మీరు చెప్పిన రీతిగా నడుచుకుంటాను. నా జీవిత విధానం మీ ఆశయాలకు అనుగుణంగా మలుచుకుంటాను. ఒక సాధారణ వ్యక్తిని అసాధారణ వ్యక్తిగా మార్చడంకోసమైనా మీరు నన్ను ప్రేమించగలరా?"

అరుణ పెద్దగా ఆశ్చర్యపడ్డట్లు కనబడలేదు. "నాకు అందముంది. చాలా ఆకర్షణీయంగా కనబడతాను. నన్ను ప్రేమించానని అతి స్వల్ప పరిచయంలో నేవిమగవాడైనా అంటే అదో పెద్ద విశేషం కాదు. కానీ నేను సాధారణ వ్యక్తుల్ని, అసాధారణ వ్యక్తులుగా మార్చడానికీ- దుర్మార్గుల్ని సంస్కరించడానికీ ప్రేమించే రకంకాదు. నా ప్రేమ నా జీవితానికి సంబంధించినది. పెళ్ళి ముడివేసి ఆలోచించే ప్రేమమీదయితే ఆ ఆశ పెట్టుకోకండి. తల్లినీ, భగవంతుణ్ణీ ప్రేమించే విధంగా నన్ను ప్రేమిస్తున్న పక్షంలో నీ జీవితం ఎలావుండాలో చెబుతాను. అలా నడుచుకోండి."

అరుణ మాటలకు రఘుకి కోపం వచ్చింది. "మీకు చాలా గర్వంలా వుంది."

"గర్వమనే పదానికి నాకు అర్థం తెలియదు. నా మనసులోని మాట నిస్సంకోచంగా బయటకు అనేసాను. అదే గర్వమనుకుంటే నేను గర్విష్టినే! మీ ప్రేమ అర్థంలేనిదని భావించినందుకూ, అర్థంలేని మీ ప్రేమను తిరస్కరించినందుకూ నేను గర్విష్టినని మీరనుకుంటే- అది మీ తెలివితక్కువ అవుతుంది" అంది అరుణ.

# 7

"ఇన్నాళ్ళకు నేను గుర్తొచ్చానా?" అన్నాడు జానకిరామయ్య.

ఆయనన్న ఆ మాటల వెనుక ఎంతో ఆవేదన వుంది. కొడుకులిద్దరికీ ఆస్తి విభాగం చేసేటప్పుడు నగరంలో వున్న రెండో ఇంటిని రఘుకిచ్చేశాడాయన. కొడుకు తనని తనతోపాటు రమ్మంటాడేమోనని అనుకున్నాడు. "మీరు గోపీదగ్గరే వుండండి నాన్నా - నా పద్ధతులు సరిపడవు మీకు" అన్నాడు రఘు.

జానకీరామయ్యకు రఘుతో వెళ్ళాలని లేదు. కానీ రమ్మంటాడేమోనని ఆయన తండ్రి ప్రాణం ఆరాటపడింది. చిన్నకొడుకు మాటమాత్రంగా అభిమానం చూపిస్తే చాలునని ఆయనకుంది. ఆ అభిమానం ఉపయోగించుకోవాలని ఆయనకు లేదు. అయితే ఆమాత్రం కూడా ఆయనకు లభించలేదు. అదలాగుంచితే ఆస్తి విభాగం అయిపోయాక ఇంతకాలంవరకూ ఒక్క పర్యాయంకూడా రఘు తండ్రిని చూడ్డానికైనా ఈ ఇంటి గుమ్మం తొక్కలేదు.

"అనుక్షణం మీరు నా గుర్తులోనే వుంటారు నాన్నా కానీ తీరుబడి ఉండదు నాకు. అయిదారు నెలల్లో తెలివితక్కువగా డబ్బు చాలా వృథా చేసేశాక నా కళ్ళు తెరుచుకున్నాయి. అంతవరకూ విలాసాల్లో మునిగి తేలుతూ మీదగ్గరకు రాలేకపోయాను. ఆ తర్వాత బాధ్యత గుర్తించి వ్యాపారం ప్రారంభించాను. ఆ కారణంగా మళ్ళీ మిమ్మల్ని కలవడానికి తీరుబడి లేకపోయింది నాకు."

రఘు మాటల్లో నిజానిజాలతో జానకిరామయ్యకు నిమిత్తంలేదు. రఘు ఇలా మాట్లాడడమే ఆయనకుచాలా వింతగా, ఆశ్చర్యంగా వుంది.

"ఏమిటి నువ్వు ప్రారంభించిన వ్యాపారం? ఈ విషయంలో అన్నయ్య సలహా తీసుకున్నావా?" అనడిగాడాయన.

"లేదు నాన్నా-కోదండం సాయం తీసుకున్నాను. అన్నయ్య వ్యాపారంతో పోటీ పడడం నాకిష్టంలేదు. సరుకులు రవాణాచేయడం మా వ్యాపారం. లాభాలు బాగా వచ్చేలాగున్నాయి."

కోదండం పేరు వినగానే జానకిరామయ్య ముఖంలో అసంతృప్తి కనబడింది. కానీ ఆ అసంతృప్తిని మాటల్లో కనబడనివ్వలేదాయన. అసలు కొడుకు దృష్టి వ్యాపారం మీదకు మళ్ళడమే పెద్ద విశేషంగా భావిస్తున్నాడాయన. తృప్తిగా కొడుకుతో కాసేపు సంభాషించేక ___

"నేను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను నాన్నా!" అన్నాడు రఘు.

ఆశ్చర్యపడ్డాడు జానకిరామయ్య. తను మనసులో కోరుకుంటున్న విషయంకూడ ఆ నోటివెంట రావడం ఆయనకు చాలా ఆనందాన్ని కలిగించింది. కాసేపు సంభాషణ జరిగేక తను అరుణను ప్రేమించాననీ, కానీ పెళ్ళి వ్యవహారాలు తండ్రిద్వారా జరిపించాలని అనుకుంటున్నాననీ అతను చెప్పాడు.

జానకిరామయ్య వెంటనే గోపీకి కబురంపాడు. గోపీ రాగానే విషయం చెప్పాడాయన.

గోపీ దెబ్బతిన్నట్లు కనబడ్డాడు. "ఆ అమ్మాయికీ పెళ్ళి ఇష్టమేనా?" అన్నాడు.

రఘు తలవంచుకుని "నాకు తెలియదు. ఆమెను

చూశాకనే నాకు పెళ్ళిచేసుకోవాలన్న ఆలోచన బయ లేరింది. నేనూ నలుగురిలా జీవించాలని అనిపించ సాగింది'' అన్నాడు.

''బాగానే వుంది. కానీ ఒకవేళ ఆ అమ్మాయి ఇష్టపడకపోతే.''

''ఆడపిల్లగదా అన్నయ్యా పెద్దలు చెప్పిన మాట వింటుంది. సంబంధం వాళ్ళ అన్నయ్యద్వారా కదపండి'' అన్నాడతను.

గోపీ ముఖం అంత తృప్తిగా లేదు. ''ఆ అమ్మాయి వాళ్ళన్నకు ఒక్కగానొక్క చెల్లెలు. ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా వాళ్ళన్న చేస్తాడని నేననుకోను.''

''అయినా రఘు అంటే ఆమె ఇష్టపడదని మనం ముందే ఎందుకనుకోవాలిరా'' అన్నాడు జానకిరామయ్య. గోపీ మాట్లాడకపోగా-''ఒరేయ్ ఈ బాధ్యత నీమీద నే పెడుతున్నాను. ఎలాగో అలా ఈ పెళ్ళి కుదర్చాలి. నీ విషయంలోకూడా సంబంధాలు చూస్తున్నాను. వీలుపడితే ఇద్దరికీ ఒకేసారి పెళ్ళి జరిపించేయాలనివుంది'' అన్నాడాయన మళ్ళీ.

''నాన్నా చాలాకాలం తర్వాత నాకు మామూలు జీవితంపై మోజు కలిగింది. ఈ పెళ్ళి కుదరకపోతే నా మోజు విరక్తిగా మారిపోయి నేనేమైపోతానో తెలియదు. నేను మనిషిలా బ్రతకాలని మీకుంటే-తండ్రిగా మీరేం చేయగలరో చేయండి. నేను మళ్ళీవచ్చి మిమ్మల్ని కలుసు కుంటాను'' అని వెళ్ళిపోయాడు రఘు.

''గోపీ విన్నావుకదా వాడి మాటలు. ఆ పిల్ల కార ణంగా వాడు మామూలు మనిషవుతాడని నాకు నమ్మ

కంగా వుంది. ఎలాగో అలా ఈ పెళ్ళి జరిగేలా చూడరా బాబూ'' అన్నాడు జానకిరామయ్య.

''నాన్నా మనమిద్దరం కోదండంగారింటికి వెళ్ళి వద్దాం'' అన్నాడు గోపీ.

# 8

కోదండానికి నిజంగానే చాలా సంతోషంగా ఉంది' జానకిరామయ్యగా ఊళ్ళో బాగా పేరు ప్రతిష్ఠలున్నాయి' ఆయన ఇంటికోడలు కావడం అదృష్టం. ఆ కుటుంబంలో వియ్యమందడం తన అదృష్టం.

''బాబూ_ఈ విషయం చెప్పడానికి మీరు స్వయంగా బయల్దేరి రావాలా? కాకితో కబురంపితే రెక్కలు కట్టుకొచ్చి స్వయంగా మీ ఇంటి ముందు వాలేవాణ్నిగా...'' అన్నాడు కోదండం.

''దాందేముంది. అబ్బాయి ముచ్చటపడుతున్నాడు. అడగాలని వచ్చాను'' అన్నాడు జానకిరామయ్య.

''అయితే మనం మిగతావిషయాలు మాట్లాడుకో వచ్చా'' అన్నాడు గోపీ.

''నిరభ్యంతరంగా—...'' అన్నాడు కోదండం.

''ఈ లోగా మీరు మీ చెల్లెలితో సంప్రదించవలసిన అవసరం లేదా?''

''మీ కున్న పేరు ప్రతిష్ఠలు నాకు లేకపోయినా— మాదీ సంప్రదాయమైన కుటుంబం బాబూ - నా చెల్లెలు నేను గీచిన గీటు దాటదు'' అన్నాడు కోదండం.

''అవుననుకోండి. కానీ ఈ రోజుల్లో పిల్ల ఇష్టం గురించి తెలుసుకోవడం మంచిది. అసలే కాలేజీలో చదువుతోందంటున్నారు'' అన్నాడు గోపీ.

జానకిరామయ్య విసుగ్గా కొడుకువంక చూసి "ఈ కళంకలన్నీ మనకెందుకురా—అది వారి కుటుంబ విషయం. మనకాయన ఇచ్చిన మాట జరుగుతుంది. అంతేకదా మన కా్కవలసింది. ఇందులో ఇంక మాట్లాడుకోవలసిన విష యాలుకూడా ఏమీ లేవు. నాకు కట్నాల ఆశ, లాంఛ నాల పట్టింపులు లేవు. వారి తాహతుకు తగినట్లుగా జరిపి స్తారు. ఇంక మనం పోదాంపద" అన్నాడు.

"ఒక్కగానొక్క చెల్లెలు. ఏ విషయంలోనూ లోటు చేయను నేను" అన్నాడు కోదండం.

తండ్రీ కొడుకు లిద్దరూ తృప్తిగా ఇంటికి వెళ్ళారు. ఆ రోజు రాత్రి ఆరుగంటల ప్రాంతంలో వాళ్ళింటికి కోదండం వచ్చాడు.

"బాబుగారూ—అనుకోకుండా చిన్న పరిణామం ఏర్ప డింది మా ఇంట్లో. మీరు నన్ను క్షమించాలి."

జానకిరామయ్య అనుమానంగా భయంగా కోదండం వంక చూశాడు.

"నా చెల్లెలు మీ ఇంటి కోడలవుతుంది. కానీ..."

"కానీ..." అన్నాడు జానకిరామయ్య ఇంకా అను మానంగా.

"మీరు చెప్పినవిధంగా కాక—ఆమె మీ ఇంటికి పెద్ద కోడలవుతుంది..."

జానకిరామయ్య గుండెల్లో పిడుగులు పడ్డట్టయింది— "ఏమిటీ తమాషా?" అన్నాడాయన ఆగ్రహంగా.

"నా చెల్లెలు అరుణ, మీ పెద్దబ్బాయి గోపీ పరస్పరం ప్రేమించుకున్నారుట బాబూ..." అన్నాడు కోదండం.

జానకిరామయ్యకు నోట మాటరాలేదు. ఆ పరిస్థితుల్లో

ఏం చేయాలో, ఏం మాట్లాడాలో ఆయన కర్థంకాలేదు. కాసేపుండి స్థిమితపడ్డాక ఆయన వెళ్ళిపొమ్మన్నట్లు కోదండానికి సైగచేశాడు.

"మీ అభిప్రాయం తెలుసుకుందామని వచ్చాను" అంటూ నసిగాడు కోదండం.

"రేపు తెలుస్తుంది..." అన్నాడాయన. కోదండం వెళ్ళిపోయాడు. రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో కొడుకు ఇంటికి వచ్చేక ఆయన దగ్గరగా పిలిచాడు.

తండ్రి వాలకం చూసి - "అదేమిటి నాన్నా - అలా గున్నారు?" అన్నాడు గోపీ.

"గోపీ-నీకూ నాకూ కూడా విషమసమస్య వచ్చిందిరా!" అన్నాడు జానకిరామయ్య.

"ఏ విషయంలో?"

"రఘు పెళ్ళి విషయంలో?"

గోపీ మాట్లాడలేదు. అతనికి పరిస్థితి చూచాయగా అర్థమైంది.

"ఈ సమస్యను నువ్వే పరిష్కరించాలి..."

"చెప్పండి నాన్నా..."

"నీ బాధ నా కర్థమైంది. నువ్వు అరుణను ప్రేమిస్తున్నావు, ఆమెకూడా నిన్ను ప్రేమిస్తోంది. ఇది మీ ఇద్దరి మధ్యనూ ఉన్న విషయం. నీలో అన్ని మంచిగుణాలూ వున్నాయి. నీకు పెళ్ళికావడం పెద్ద కష్టంకాదు. నీ మంచి గుణాలవల్ల ఎలాంటి ఆడపిల్ల జీవితంలో ప్రవేశించినా సుఖపడుతుంది. కానీ నీ తమ్ముడి విషయంలో అలాకాదు. వాడూ అరుణనే ప్రేమిస్తున్నాడు. మరో ఆడపిల్లను పెళ్ళి చేసుకుంటే ఆ పిల్ల జీవితాన్ని నరకప్రాయం

చేస్తాడు. ఈ పిల్లతో పెళ్ళికాకపోతే వాడెలాంటి జీవితం గడుపుతాడో కూడా తెలియదు నాకు. వాడి గురించి నువ్వు త్యాగం చేయాలి...'' జానకిరామయ్య క్షణం ఆగి ''వయసులో ఉన్న యువతీ యువకుల మధ్య ప్రేమ పేరుతో అంకురించేది కేవలం ఆకర్షణ. ఆ ఆకర్షణను కని పెంచిన తండ్రి కోసం, తోడబుట్టిన తమ్ముడి కోసం త్యాగం చేయడం పెద్ద విశేషం కాదు'' అన్నాడు.

''మీరు చెప్పింది నాకర్థమైంది నాన్నా నా తరఫున నేను త్యాగం చేసినా అరుణ విషయంలో నేనేం చేయ గలను?''

''అరుణ నిన్ను ప్రేమిస్తానంటోంది కదా - ఆమెను ఎలాగో అలా నువ్వే ఒప్పించాలి నిజంగా నిన్ను ప్రేమి స్తూంటే ఆమె ఇందుకు తప్పక ఒప్పుకుంటుంది.''

గోపీ లేచాడు—''నేను ప్రయత్నిస్తాను - నాన్నా. మనస్ఫూర్తిగా నే ప్రయత్నిస్తాను. కానీ అరుణను మాటల్లో గెలవడం చాలా కష్టం. అందువల్ల ఫలితం గురించి నేనేమీ చెప్పలేను.''

జానకిరామయ్య జాలిగా గోపీవంక చూసి — ''నా బాధ అర్థం చేసుకోరా - నేను నీకన్యాయం చేస్తున్నానని మనసులో నా పట్ల ద్వేషం నింపుకోకురా. రఘు బాగు పడడానికున్న ఏకైక అవకాశమిది అని నాకు తోస్తోంది'' అన్నాడు.

''మిమ్మల్ని ద్వేషించే హీనస్థితికి నేనెప్పుడూ దిగ జారుతాననుకోను...'' అన్నాడు గోపీ.

# 9

''ఏమందిరా అరుణ?''

గోపీ తన చేతిలోని టేపురికార్డర్‌ను బల్లమీద పెట్టి-

ఆన్ చేశాడు.

"గోపి _ మన పురాణాల్లో అంటరానితనం ప్రబోధించ బడింది. పుట్టుక కారణంగా కొంతమంది అంటరానివా రవుతారంటే కొంతకాలం మనం నమ్మాం. కానీ ఇప్పుడు అంటరానితనాన్ని నిరసిస్తున్నాం_అవునా?"

"అవును..."

"అయితే పురాణ గ్రంథాలను అసహ్యించుకుంటు న్నామా? వాటిని ప్రమాణగ్రంథాలుగా స్వీకరించడం మానేశామా?"

"లేదు. ఇప్పటికీ వాటిని పవిత్ర గ్రంథాలుగా భావి స్తూనే వున్నాం..."

"అంటే అర్థమేమిటో తెలుసా? వాటిలోని మంచినే కానీ చెడ్డను మనం స్వీకరించం. అందులోని చెడ్డను నిర సిస్తూనే_మంచి విశేషాలున్న కారణంగా వాటిని పవిత్ర గ్రంథాలుగా భావిస్తూంటాం."

"అవును_ఇదెందుకు చెబుతున్నట్లు?"

"ఏమీలేదు. శ్రీరాముడికి కొన్నితరాలముందు ఆ దేశపు మహారాజు అతిథి మర్యాదకోసం తన భార్యను_ అతిథి ఆనందంకోసం పంపించాడని రామాయణంలో వుంది. అది మంచిదేనంటావా? అలాంటి అతిథి మర్యాద ఇప్పుడూ చేస్తే బాగుంటుందంటావా?"

"బాగుండదు..."

"రామాయణం పవిత్రత నంగీకరించిన మాత్రాన రామాయణంలోని ప్రతివిషయాన్నీ ఆచరించకూడదని అంగీకరించిన నువ్వు ఇప్పుడు చేస్తున్నదేమిటి? పితృ వాక్య పరిపాలనార్థం ఒక స్త్రీని వ్యభిచారానికి ప్రోత్సహిస్తున్నావు."

"నేనా—వ్యభిచారానికి ప్రోత్సహించడమా?"

"ప్రేమను త్యాగం చేయడమంటే అర్థమేమిటి? నా కిష్టంలేని ఇంకో పురుషుడిని పెళ్ళిచేసుకుని అతనితో కాపురం చేయమంటున్నావ్ వ్యభిచారానికింకో పేరు అది."

"అలా ఎందుకనుకుంటున్నావు అరుణా—ఒకోసారి అనుభవరహితంగా కొన్ని నిర్ణయాలకు వస్తాం మనం. వాటిని సడలించుకుంటే అది వ్యభిచారం కాదు."

"అలాగే అయితే నీతో నా పెళ్ళి కాకపోతే బలవంతంగా నా ప్రాణాలు తీసుకుంటాను. అప్పుడేమవుతుంది? హత్యా—ఆత్మహత్యా? హత్యే అయితే హంతకు డెవరు?"

"అరుణా అలాంటి మాటలనకు. నాకోసం నువ్వు త్యాగం చేయాలి."

"ఏమీకాని నీకోసం నేనెందుకు త్యాగం చేయాలి? నీకు నిజంగా ఏమైనా అయినపక్షంలో నీకుటుంబంకోసం ఏ త్యాగమైనా చేస్తాను. కానీ అప్పుడు నీ తమ్ముడికి నేను వదినవుతాను..."

"ఏం మాట్లాడాలో నాకు తోచడంలేదు. మా నాన్న గారి బాధ చూడలేను నేను."

"అయితే మీ నాన్నగారికీ విషయం చెప్పు. నేను మనసారా నిన్ను ప్రేమిస్తున్నాను. రఘు నాకు మరిది అవుతాడు. ఏ పరిస్థితిల్లోనూ నేను రఘుని వివాహం చేసుకోలేను. అదీకాక రఘులాంటి దుర్మార్గుడికి వివాహంచేసి ఒక ఆడపిల్ల గొంతుకోయడం తండ్రి అయి నప్పటికీకూడా—ఆయనకు తగదని చెప్పు."

"గోపీ-ఆ టేపు ఆపేయ్" అన్నాడు జానకి రామయ్య. గోపీ స్విచ్ ఆఫ్ చేయగానే "ఆ పిల్ల చాలా తెలివైనదిరా-రఘుని చేసుకునివుంటే తప్పకుండా వాడి జీవితం బాగుపడి వుండేది. కానీ ఆ పిల్లను ఒప్పించలేం" అన్నాడాయన.

తర్వాత రఘుకు కబురుపెట్టి ఆయన ఆ టేపు వినిపించాడు. రఘు పిడికిళ్ళు బిగిసాయి.

"ఆల్ రైట్ నాన్నా-నాకిలాంటి జీవితమే రాసిపెట్టి వుంది. మీరు నన్ను మళ్ళీ చూడగలననుకోకండి" అని వెళ్ళిపోయాడతను.

ఆ మర్నాడుదయానికి గుండెపోటువచ్చి జానకి రామయ్య తనువు చాలించాడు.

# 10

"ఎవరు మీరు?" అంది అరుణ.

"మీ శ్రేయోభిలాషిని" అన్నదామె.

"మీ పేరు?"

"నా పేరేదైతేనేం-నన్ను రఘు పంపించాడు."

"రఘుచేత పంపబడినవారెవ్వరూ నా శ్రేయోభిలాషులు కాలేరు."

"కానీ నేనుమాత్రం మీ శ్రేయోభిలాషినే. నేను మీకు అందజేసే సమాచారం...మీ భవిష్యత్తు గురించి మీరు మంచి నిర్ణయం తీసుకునేందుకు సహకరిస్తుంది" అన్నదామె.

"అయితే చెప్పండి."

"చెప్పేముందు ఒక చిన్న ప్రశ్న. మీరు రఘును వివాహం చేసుకునేందుకు నిరాకరించారట. ఏ కారణంగానో తెలుసుకోవచ్చా?"

"రఘుగురించి తెలిసినవారెవ్వరూ ఈ ప్రశ్నఅడగరు. అతను పరమ దుర్మార్గుడు" అంది అరుణ.

"అయితే రఘుగురించి నీవు సరిగ్గా తెలియదనే అనుకోవాలి" అలా అన్నప్పుడు ఆమె అదో రకంగా నవ్వింది. ఆ నవ్వులో ఏమున్నదో చెప్పడం కష్టం.

"తెలుసును కాబట్టే."

"అతన్ని పెళ్ళిచేసుకోనని అన్నానంటారు. అయితే అలా అన్న కారణంగానే అతన్ని గురించి మీకేమీ తెలియదని నేననుకుంటున్నాను."

"రఘు మీ దృష్టిలో మంచివాడు కావచ్చు కానీ..."

ఆమె అరుణ మాటలు వినకుండా విరగబడి నవ్వింది. అరుణ ఆశ్చర్యపడి మాట్లాడ్డం మానేసి ఆమెవైపే చూస్తూండిపోయింది.

ఆమె నవ్వు ఆపుకుంటూ "రఘుకూ మంచితనానికీ కలయిక కుదరదు. అతను పరమ కర్కోటకుడు..." అంది.

"అయితే..." అంది అరుణ.

"అదే చెబుతున్నాను. అతనెంతటి కర్కోటకుడో నీకు తెలియదు. తనను ఎదిరించిన వ్యక్తులపై అతను పగబడతాడు. పగబట్టిన ఏ వ్యక్తినీ అతనింతవరకూ విడిచిపెట్టలేదు. అతను పగ తీర్చుకునే వ్యక్తిని క్రూరాతి క్రూరంగా శిక్షిస్తాడు. అతడు పెట్టే హింస శరీరానికి కాదు_మనసుకు! అది తట్టుకుని నిలబడేకంటె అతను చెప్పినదానికి అంగీకరించి తలవంచి నడవడమే మంచిది."

"ఇలా బెదిరించమని రఘు మిమ్మల్ని పంపాడా?"

"అవును. ఈ ఫోటో చూడండి" అంటూ ఒక ఫోటో అందించిందామె అరుణకు. అరుణ అందుకుని చూసి తృళ్ళిపడింది. ఆ ఫోటోలో రఘు నిలబడివున్నాడు అతని రెండు చేతుల్లోనూ రెండు గొలుసులున్నాయి. ఒక గొలుసు కుక్క మెడలో వున్నది. రెండో గొలుసు...

"ఇలాంటి ఫోటో నాకు చూపించడానికి మీకు సిగ్గు లేదూ?"

"సిగ్గా?" అదోలా నవ్విందామె. "అదెప్పుడో పోయింది నాకు. నాకిప్పుడు మనసు లేదు. కేవలం నా శరీరంకోసం బ్రతుకుతున్నాను నేను. ఒకసారి రఘును ఎదిరించినందుకు అతను నాకు చేసిన అవమానమిది. నన్ను కుక్కను చేసి ఓపూటంతా వినోదించటమేకాక- నన్ను కుక్కగా తన మిత్రులముందు ప్రదర్శించాడు. భౌ భౌమని మొరిగించాడు. నాకు కుక్క బిస్కట్లు పెట్టించాడు. మీరు తనసెదిరిస్తే ఈ ఫోటోలో కుక్క స్థానంలో వున్న నన్ను-మీకు హెచ్చరికగా చూపించమన్నాడు రఘు. అన్నంత పనీ చేయగల రఘుతో వైరం మీకు మంచిదికాదు."

అరుణకు నోట మాటరాలేదు. ఆ ఫోటోవంక మరో సారి చూసిందామె. శరీరం జలదరించిపోయింది. రఘు గురించి నిజంగా తనకు పూర్తిగా తెలియదు. అసలు మనిషిలో ఇంత క్రూరత్వముంటుందనే తనకు తెలియదు.

"బాగా ఆలోచించుకోండి."

"ఇంకా ఆలోచించడానికేముంది మేడమ్-అన్నీ మీరే స్పష్టంగా చెప్పారు. తెలిసి తెలిసీ ఇంతటి దుర్మార్గుడికి ఇల్లాలు కావాలని ఏ ఆడదీ కోరుకోదు. రఘుపట నాకు

గల అసహ్యాభావం ఇంకా పెరిగింది. అవసరమైతే ప్రాణాలైనా తీసుకుంటానేగానీ అతడి క్రూరత్వానికి తల వంచను.''

''అలా అనుకోకండి. ఇంకా ఆలోచించండి. కోరి ప్రమాదాన్నాహ్వానించకండి. అతను ప్రస్తుతం బిచ్చగాడిలా ప్రేమనర్థిస్తున్నాడు.''

''మేడమ్'' కోపంగా అంది అరుణ. ''మీ పేరు నాకు తెలియదు. రఘు బిచ్చగాడిలా ప్రేమ నర్థించుగాక నేనుమాత్రం అడ్డమైనవాళ్ళకూ బిచ్చంవేసే రకం కాదు.''

# 11

''జరిగినదేదో జరిగిపోయింది. నన్ను క్షమించా లన్నయ్యా'' అన్నాడు రఘు.

''మనలో మనకు క్షమార్పణ లెందుకురా?'' అన్నాడు గోపీ.

''లేదన్నయ్యా-నా ప్రవర్తనతో నిన్నూ నాన్ననూ కూడా చాలా కష్టపెట్టాను. నేను నీతోపాటు కలిసి ఉండాలనుకుంటున్నాను. ఆ విధంగా నాన్న ఆత్మ శాంతించవచ్చు'' అన్నాడు రఘు.

''నిన్నో ఇంటివాడిని చేయాలని నాన్న చాలా తాపత్రయపడ్డాడు. అది జరిగేదాకా నాకూ తృప్తి ఉండదు'' అన్నాడు గోపీ.

అతనికి కాస్త దూరపు ఆలోచనా, ముందు చూపూ వున్నాయి. తనకు వివాహం కాగానే తమ్ముడు తనతో కలిసి వుండాలనుకోవడం అతనికి నచ్చలేదు. తమ్ముడి ప్రవర్తనమీద అతనికి నమ్మకంలేదు. అదీకాక అతను

చేసుకుందామనుకున్న అమ్మాయినే తను చేసుకున్నాడు. తమ్ముడు తనతో కలిసివుండే పక్షంలో అతనికీ వీలైనంత త్వరగా వివాహం చేసేయాలని అతని ఆలోచన. కలిసి వుంటానని తమ్ముడంటే తను కాదనడం బాగుండదు.

గోపీకి రఘుమీద ప్రేమాభిమానాలున్నాయి కానీ నమ్మకంలేదు. చిన్నప్పట్నించీ అతనికి రఘు తెలుసును. ఒక్కసారికూడా నమ్మదగ్గవిధంగా అతను ప్రవర్తించలేదు. తండ్రిలేని ఇంట్లో తనూ తమ్ముడూ కలిసివుండడం కోరి తన జీవితానికి అనర్థం తెచ్చిపెట్టుకోవడమేనని అతనికి తెలుసు.

"ఎందుకన్నయ్యా నాకు పెళ్ళి? నాకు జీవితంమీద పెద్దమమకారంలేదు" అన్నాడు రఘు.

"అలాగంటే ఎలా? నీ పెళ్ళి నా బాధ్యత!" అన్నాడు గోపీ.

"అయితే నీ ఇష్టం. నీమాట కాదనను నేను. నీకు తోచిన సంబంధం స్థిరపరిచేయి. నేనొప్పుకుంటాను" అన్నాడు రఘు.

గోపీకి కొంతమంది సన్నకారు వ్యాపారస్తులతో పరిచయముంది. వారిలో ఎవరైనాసరే తనఇంటి సంబంధమంటే ఎగిరి గంతేస్తారు.

తర్వాత గోపీ అరుణను పిలిచి రఘు అభీష్టాన్ని చెప్పాడు. ఆమెకవి అట్టే నచ్చలేదు. కానీ గోపీ నెమ్మదిగా ఆమెకు నచ్చచెప్పి ఒప్పించాడు. ఫలితంగా రఘు కోసం ఆ ఇంట్లో ఒక గది ప్రత్యేకించబడింది.

భర్త ఎన్నిచెప్పినా అరుణకు బెంగగానే వుంది. ఆమె దృష్టిలో తనను కలుసుకుని ఆ యువతి చూపించిన

ఫోటో మెదుల్తోంది. అది రఘు క్రూరత్వానికి, పగతీర్చు కునే విధానానికి ఫోటో! రఘు తనని వదిలిపెడతాడని ఆమెకు తోచడంలేదు. అందుకని తన జాగ్రత్తలో తనుంటోంది.

కానీ రఘు ప్రవర్తనలో చెప్పుకోదగ్గ మార్పు కనబడు తోంది. అతను అన్నగారిపట్ల అతివినయాన్ని ప్రవర్తిస్తు న్నాడు. ఆ వినయానికి అన్న ముగ్ధుడవుతున్నాడు కూడా. రఘు ప్రవర్తన కారణంగా గోపీలోని భాతృ ప్రేమ క్రమంగా చిగిర్చి పుష్పించడం మొదలయింది.

రఘు ప్రతి ఉదయం స్నానానంతరం అన్నగారికి పాదాభివందనం చేస్తాడు. బయట ఎక్కడ తిరిగినా అన్నగారిని ప్రశంసిస్తూ, అతనిపట్ల తనకుగల భక్తి భావాన్ని ప్రస్తావిస్తూ వుంటాడు. అన్నగారు వచ్చే వరకూ ఉదయంగానీ రాత్రిగానీ భోజనం చేయడు. అన్న గారి టైములకనుగుణంగా తన కార్యక్రమాలను సరి జేసుకుంటూ వుంటాడు.

తమ్ముడిలో వచ్చిన మార్పు గోపీని పూర్తిగా కరిగించి వేస్తోంది. తండ్రి వుండగానే తమ్ముడిలో ఈ మార్పు వచ్చివుంటే ఎంత బాగుండేది? అనుకునేవాడతను. ఏ స్త్రీలో కారణంగా తమ్ముడు మారతాడని తండ్రి ఆశించాడో అదేమార్పు-ఆ స్త్రీతో తనకు పెళ్ళిజరగడం ద్వారా తమ్ముడిలో వచ్చింది.

సుమారు నెలరోజులు గడిచాక ఒకరోజు అరుణ స్నానాలగదిలోకి వెళ్ళి బట్టలు విప్పుకుంటూండగా "వాటే బ్యూటీ" అన్న పురుష కంఠం వినబడి వులిక్కి పడింది. అప్రయత్నంగా ఆమె చీరను ఒడలంతా కప్పింది.

చీకటిగా వున్న ఒకమూలనుంచి రఘు బయటకు వచ్చాడు. ఆమె తలుపులు గబగబా తీసుకుని బయటకు వెళ్ళిపోయింది. బెడ్రూమ్‌లోకి వెళ్ళి తలుపులు వేసుకునే వరకూ ఆమె గుండెలదురుతూనే వున్నాయి.

ఆ రాత్రి ఆమె భర్తకు రఘు ప్రవర్తన సరిగాలేదని చెప్పింది.

"ఎప్పట్నుంచి?"

"ఈరోజు ఉదయం పదకొండు గంటలకు రఘు నేను వెళ్ళేసరికి బాత్రూమ్‌లో ఓమూలగా నక్కివున్నాడు. చటుక్కున బయటకు వచ్చేశాను" అంది అరుణ.

ఒక్కక్షణం సాలోచనగా తలపంకించి "రఘు నాతో పాటే బైటకు వచ్చేశాడుగా" అన్నాడు గోపీ.

"అవుననుకోండి. కానీ ఎప్పుడో మళ్ళీ వచ్చి వుంటాడు."

"అదిసరే_తను శేషారావునికలుస్తానని నాతోఅన్నాడు. పన్నెండింటికి శేషారావు నాదగ్గరకు వచ్చాడు. ఈరోజు పదింటినుంచి పావుతక్కువ పన్నెండుదాకా రఘు అతని వద్దే వున్నాడుట. మాటల సందర్భంలో ఆ విషయం చెప్పాడు."

అరుణ భర్తవంక అదోలా చూసి "తమ్ముణ్ని వెనకేసుకు రావడంకోసం అబద్ధం చెబుతున్నారా? దీనివల్ల పరిణామాలు చాలా దూరంగా వుండవచ్చు" అంది.

గోపీకి కాస్త కోపంవచ్చి "అసలు నేనబద్ధం చెబుతున్నానన్న అనుమానం నీకెలా వచ్చింది? నువ్వన్నది అబద్ధమని నేననలేదే!" అన్నాడు.

అరుణ దెబ్బతింది. "అయితే నేనబద్ధం చెబుతున్నానంటారా?"

"పిచ్చి అరుణా" అన్నాడు గోపీ నవ్వి. "నువ్వు తెలివైనదానివనీ నాకంటెకూడా ఎక్కువ తెలివైనదానివని నాకు తెలుసు. కానీ ఒకోసారి మన తెలివితేటలే మన ప్రాణాలమీదకు తెస్తాయి. మనలో మనం ఒకరినొకరు అనుమానించకూడదు. నేను తమ్ముడి విషయంలో అబద్ధం చెప్పాననీ అనుకుంటున్నావు కాబట్టి అదిప్పుడే ఋజువుచేస్తాను. శేషారావు తమ్ముడికీ నాకూ జరిగిన సంభాషణ చెప్పాడు. ఇప్పుడు తమ్ముణ్ని పిలిచి ఉదయం పదకొండుగంటల ప్రాంతాల ఎక్కడున్నాడో ఏంచేశాడో అడుగుతున్నాను. వాడు చెప్పిందీ నేను చెప్పిందీ టాలీ అవుతుందో లేదో చూడు. ఈవిషయంలో మేమిద్దరమూ గూడుపుఠాణీ అవుతామని నువ్వనుకోవు గదా?"

అరుణ అప్పటికి మాట్లాడకపోయినా ఆ తర్వాత రఘు తను శేషారావు దగ్గరకు వెళ్ళాననడమూ-భర్త చెప్పిన మాటలూ, అతని మాటలూ టాలీ అవడమూ ఆమె బెంగను పెంచింది.

ఆ రాత్రే గోపీని రఘు చాటుగా పిల్చి "నీకిష్టం లేదంటే చెప్పు అన్నయ్యా నేను వేరే వెళ్ళిపోతాను" అన్నాడు.

"ఆదేం?" అన్నాడు గోపీ.

"వదినకు నేను మీ ఇంట్లో వుండడం ఇష్టంలేనట్లుంది తన అయిష్టాన్ని రకరకాలుగా వ్యక్తం చేస్తోంది. నీకే ఇష్టంలేక తననలా ప్రవర్తించమన్నావోఏమిటో నాకర్థం కావడంలేదు" అన్నాడు రఘు.

గోపి అర్థమైనట్లు తల పంకించాడు. అరుణకు రఘు

ఇక్కడుండడం ఇష్టంలేదు. అందుకోసమని అబద్ధాలు కల్పిస్తోంది. ఆమె భర్తమాటలకు అర్థం లేకపోలేదు. కానీ రఘు ఇప్పుడు మారిపోయాడు. ఇప్పుడు వాడిని ఇంట్లోంచి బయటకు పంపేస్తే వాడు చెడిపోవచ్చు, లోకం తనను నిందించవచ్చుకూడా!

"అరుణా! ఈ పర్యాయం రఘు నిన్ను అల్లరిపెడితే సరిగ్గా టైము చూసి నాకు చెప్పు" అన్నాడు గోపీ భార్యతో. ఆ సంభాషణ రఘు విన్నట్లు అతనికి తెలియదు.

# 12

మర్నాడుదయం తెల్లవారుఝామునే గోపి ఏదో పని మీద బయటకు వెళ్ళిపోయాడు. రఘుకూడా అతనితో వెళ్ళాడు. వెళ్ళే ముందు తను ఎవరికీ తెలియకుండా ఇంట్లో ఉన్న అలారం గడియారాన్ని అరగంట వెనక్కు తిప్పాడు.

గోపీ, రఘు కలిసి పనులమీద ఉదయం తొమ్మిదిన్నర వరకూ కలిసి తిరిగారు. తొమ్మిదిన్నరకు రఘు అన్నయ్య దగ్గర సెలవు తీసుకుని వెళ్ళేముందు టయిమ్ చెప్పి మరీ వెళ్ళాడు.

రఘు తిన్నగా ఓ టాక్సీ చేరమాడి పది నిముషాల్లో యిల్లు చేరాడు. దొడ్డిదారిన ఎవరికంటా పడకుండా లోపల చేరాడు. ఈ దారి అతనికి చిన్నతనంనుంచీ అలవాటే. వెతుతూనే వదినగారెక్కడుందో చూసుకున్నాడు. ఇంట్లో వదినగారొక్కర్తే వుంది-పడకగదిలో బద్ధకంగా పడుకుని!

అతను తిన్నగా ఆమె గదిలోకివెళ్ళి వంటిమీద చేయి వేశాడు. ఉలిక్కిపడి లేచి—"నువ్వా!" అందామె.

రఘు మాట్లాడకుండా ఆమెను తన రెండు చేతులతో ఓసారి బలంగా కౌగిలించుకుని వదిలేసి వెళ్ళిపోయాడు. ఆమె తెల్లబోయి అలా నిలబడి ఉంది. ఆ తర్వాత అతను మళ్ళీ వచ్చినదారినే వెళ్ళిపోయాడు. బయటినుంచే దొడ్డి తలుపు తీయడం, వేయడం—అతని కొక్కడికే తెలిసిన ప్రత్యేకత!

ఓ గంట పోయాక రఘు మళ్ళీ ఇంట్లోకి వచ్చాడు. వది నకు తెలియకుండా గంటకో పర్యాయం పదినిముషాలు చొప్పున అలారం టైంపీసులో టైమ్ అడ్జస్ట్ చేశాడు. ఆ విధంగా మూడు గంటలు గడిచేసరికి అలారం టైంపీసులో చూపే టైము గోపీ చేతివాచీ టైముతో సరి అయింది.

గోపీ మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో ఇల్లు చేరాడు. అతన్ని చూడగానే అరుణ కళ్ళనీళ్ళు పెట్టు కుని "రఘు ఈ రోజు మళ్ళీ అల్లరి చేయడానికి ప్రయత్నిం చాడు" అంది.

"టైము నోట్ చేసుకున్నావా?" అన్నాడు గోపీ నవ్వుతూ.

భర్త తన ఫిర్యాదును తేలికగా తీసుకొన్నందుకు అరుణకు బాధకలిగింది "ఆఁ సరిగ్గా తొమ్మిదింపావుకి..."

"ఏమన్నావు-నిజంగా జరిగిందా?" అన్నాడు గోపీ.

"ఏమిటండీ మీ ప్రశ్నలు?" అంది విసుగ్గా బాధగా అరుణ.

"లేకపోతే ఏమిటి అరుణా! రఘు నా దగ్గర తొమ్మిది న్నరకి సెలవు తీసుకున్నాడు. తొమ్మిదింపావుకి నిన్ను కలిశాడంటున్నావ్. ఎలా సాధ్యం?"

"ఏమండీ-ఏమిటి మీరంటున్నది?"

"ఇది నిజం అరుణా" అంటూ గోపీ రఘుతో తొమ్మిది న్నరవరకూ తనకు జరిగిన అనుభవాలను పూస గుచ్చినట్లు చెప్పాడు. అరుణకు మతి పోయినట్లయింది.

"ఏమండీ_ నేనబద్ధం చెప్పగలనని మీ రనుకుంటు న్నారా? మిమ్మల్ని మోసం చేస్తానని మీరు నమ్ము తున్నారా?" అంది అరుణ.

"లేదు అరుణా! నిన్ను నువ్వే మోసం చేసుకుంటు న్నావు. రఘు చెడ్డవాడు కాడని నేననను. కానీ వాడిలో మార్పువచ్చి మంచిగా ఉండాలని అనుకుంటున్నప్పుడు_ వాడికి మన మొక అవకాశం ఇవ్వాలి. అందులోనూ వాడికి నేను స్వయానా అన్నను..." అన్నాడు గోపీ.

అరుణ క్షణం ఆలోచించి అలారం టైంపీసు తీసుకుని వచ్చింది_"నేను ఫాలో అయ్యేదీ టైమని తెలుసుగదా_ చూడండి. ఒక వేళ మీ టైముకూ దీనికీ ఏమైనా తేడా ఉన్నదేమో..."

రెండు టైములూ సరిపోగా గోపీ పకపకా నవ్వి— జాలిగా చూశాడు భార్యవంక.

# 13

"నా పగకు తిరుగుండదు. కానీ నీ విషయంలో ఏమీ చేయ బుద్ధికావడంలేదు. ఒక్కసారి నాకు లొంగిపో. నేను నిన్నేమీ చేయను. నీపై పగను మరిచిపోతాను. నువ్వు నన్ను మాటలన్నావనీ, అవమానించావనీ మరిచి పోయి_నువ్విచ్చే ఆనందాన్ని కలకాలం గుర్తుంచుకుంటాను కాదనకు అరుణా!"

అరుణ మాట్లాడలేదు కానీ ఆమె కళ్ళు నిప్పులు వర్షి స్తున్నాయి.

"అలా చూడకు అరుణా! ఇప్పటికే నా శక్తి గ్రహించి వుంటావు. ఇప్పటికి ఎన్ని పర్యాయాలో అన్నయ్యకు నా గురించి చెప్పి ఫెయిలయిపోయావు. ఇక మీదట నువ్వు నా గురించి ఏం చెప్పినా అన్నయ్య నమ్మడు. పైగా నీకూ అన్నయ్యకూ అపార్థాలు వస్తాయి. నీ ఇంట్లో నిన్నే అసక్తురాలిని చేయగలిగిన నా శక్తిని తక్కువ అంచనా వేసి ఆపదల పాలుగాకు. ఒక్క సారంటే ఒక్క సారికి ఒప్పుకో ఇక జీవితంలో నీ జోలికి రాను..."

అరుణ కన్నులింకా నిప్పులు వర్షిస్తూనే వున్నాయి.

రఘు మోకాళ్ళమీద ఆమెముందు మోకరిల్లి – భిక్షుకుడిలా చేతులుసాచి "అరుణా—నీ ముందు నేను బిచ్చగాడిని. అర్థిస్తున్నాను" అన్నాడు.

"అలా పైకెళ్ళరా ముష్టివెధవా" అంది అరుణ.

రఘు చటుక్కున లేచి నిలబడ్డాడు—"ఏమన్నావ్?"

"పోరా—ముష్టికుక్కా!" అంది అరుణ. తనను కోరరాని కోరిక కోరి—నానా విధాలుగా వేధిస్తున్న అతన్ని ఎలా నిందించాలో తెలియక అరుణ అన్న మాటలివి.

"మర్యాద తెలియనిదానా-ఇంతకాలం నీకు మర్యాదనిచ్చాను. అది నీ గురించి కాదు. నీ అందానికి ఇంక నీకు మర్యాద లేదు. ఈ రోజుతో నువ్వు నా చేతిలో—"

అతను ఆవేశంగా ముందడుగు వేశాడు.

"భీమయ్యా—" అని అరిచింది అరుణ గట్టిగా.

మరో క్షణంలో ఎవరివో ఇనుపహస్తాలు రఘును గట్టిగా బంధించాయి. రఘు వెనక్కు తిరిగి చూశాడు.

ఉక్కుపిడుగులా ఉన్న మనిషి కనిపించాడతనికి.

"వీడికి మగతనం లేదు. కానీ మగతనంగల మగ మహా

రాజుల నెందరినైనా మన్నుకరిపించగలడు. నీ ప్రవర్తనలోని మార్పు గమనించేక నేను వీణ్ణి ఈ ఇంటి కాపలాకూ, రక్షణకూ నియమించుకున్నాను. మా అన్నయ్య పంపాడు వీడిని'' అరుణ నవ్వి—''భీమయ్యా-వాడో ముష్టికుక్క! వాడితో నీకేంటి_వదిలెయ్'' అంది.

భీమయ్య రఘుని వదిలేశాడు.

''చూడోరోయ్. మనిషికీ కుక్కలకూ తేడా ఉంది. మనిషికి నీతి ఉంటుంది. నీతి అక్కర్లేదనుకునే కుక్కల్లాంటి ఆడవాళ్ళు ఈ ప్రపంచంలో లేకపోలేదు. అలాంటి వాళ్ళకోసం నువ్వూ కుక్కలా తిరగాలి. నాలుగైదుసార్లు ఛీ అనిపించుకున్నా ఎప్పటికో ఫలితం దొరికే ఓ ఇల్లు దొరక్కపోదు. అయితే ఛీ అనిపించుకున్న చోటికే పది సార్లు వెళ్ళి నువ్వు నిజంగా కుక్కనిపించుకున్నావు. నా కళ్ళముందు నిలబడితే ఇంకా ఏమంటానో తెలియదు. తక్షణం వెళ్ళిపో'' అంది అరుణ.

రఘు ముఖం అవమానంతో కమిలిపోయింది. అతను ఒక్క అంగలో విసురుగా ఆగదిలోంచి వెళ్ళిపోయాడు.

అరుణ కసి ఇంకా తీరలేదు. ఆమె ఆవేశం యింకా ఏమీ తగ్గలేదు. కోపం తీవ్రతకూడా అలాగేవుంది.ఆమె మామూలు మనిషి కావడానికి సుమారు రెండుగంటలకు పైగా పట్టింది.

ఆరాత్రి భర్త—''ఇంట్లో రఘు ఉన్నట్లులేదే—'' అన్నప్పుడామె జరిగిన సంగతులేవీ భర్తకు చెప్పలేదు. రఘు కారణంగా తనకూ భర్తకూమధ్య దూరం బాగా పెరిగింది. ఈ విషయాలేవీ ఆయన నమ్మడు. మళ్ళీ రఘు తనింట అడుగు పెట్టకపోతే బాగుండునని అనుకుందామె.

మర్నాడే రఘు తన మకాం యథాప్రకారం మార్చే

కాదు. అయితే అందుకు కారణం అరుణ ఊహించినది కాదు. దేశంలో ఎమర్జన్సీ వచ్చింది.

## 14

వీర్రాజు, శేషారావు, రఘు ముగ్గురూ ప్రాణస్నేహితులు. వారి పరిచయమలాంటిది. వారి స్నేహమలాంటిది. ఒకే మంచంమీద ఒకే పర్యాయం ఒకే అడదాన్నిపంచుకునే _ కలసి పంచుకునే మన స్తత్వమూ, స్నేహమూ ఆ ముగ్గురికీ ఉన్నాయి. అలాంటి స్నేహానికి తిరుగుండదు.

వీర్రాజుతండ్రి ఓ యస్పీ అయినప్పటికీ పెద్ద అవినీతి పరుడేంకాదు. అలాగని గొప్ప సత్ప్రవర్తనగలవాడూ కాదు. తనడ్యూటీ తను పాటిస్తూ అందినవి అందుకుంటు ఉండేవాడు. వీర్రాజు ఆయన ఒక్కగానొక్క గారాల బిడ్డ కావడంవల్ల అతని విషయంలో చూసిచూడనట్లూరుకున్నా తన బాధ్యతకున్న హద్దులవల్ల కొన్ని విషయాల్లో కొడుకునదుపులో పెట్టక తప్పలేదాయనకు.

దేశంలో ఎమర్జెన్సీ రాగానే వీర్రాజుకు స్వతంత్రం వచ్చినట్లయింది, అతని స్నేహితుడు శేషారావు ఆ ఊరి మునిసిపల్ చేర్మన్ గారబ్బాయి. చేర్మన్ గారు అధికారంలో ఉన్నపార్టీ ఆదేశాలను అక్షరాలా పాటించేటంత భక్తుడు కావడంవల్ల ఆయనకు ఎమర్జన్సీలో అధికారం పెరిగింది. డీయస్పీగారూ, చైర్మన్ గారూ చెప్పుకో దగ్గ స్నేహితులే.

శేషారావిప్పుడూరికి మకుటంలేని మహారాజయ్యాడు. అతని మిత్ర బృందంలో అతిముఖ్యులు వీర్రాజు, రఘు.

వచ్చిన కొత్త స్వతంత్రాన్ని వినియోగించుకోవడం కోసం వీర్రాజు, శేషారావు రఘుని తనపాత నివాసానికి తరలి రమ్మన్నారు. రఘువుండే మేడ వీరి విలాసాలకు

చాలా అనువుగా ఉంటుంది. వచ్చేముందు రఘు తనపగ గురించి చెప్పాడు మిత్రులిద్దరికి.

"ఈ విషయంలో నెమ్మదిగా ఆలోచిద్దాం. నిదానమే ప్రధానమన్నారు. ఇప్పుడు కొత్తగా లభించిన అధికారాన్ని సద్వినియోగం చేయాలి..." అన్నాడు శేషారావు.

"అప్పుడే తొందర పడకూడదు మనం. ముందుచిన్న చిన్న అత్యాచారాలు చేస్తాం. ప్రజలు సహిస్తున్నారో లేదో చూడాలి. వాళ్ళు సహించక ఏంచేస్తారు. సహిస్తారు! అలా కొన్నాళ్ళు సహించాక అలవాటుపడతారు. డోసు క్రమంగా పెంచుకుంటూ వెళ్ళాలి. ఒక దశకు వెళ్ళాక మనకిష్టమైన ఏ ఆడదాన్నయినా సరే......" వీర్రాజు చెప్పాడు.

"ఎమర్జన్సీ కలకాలం వర్ధిల్లాలి!" అన్నాడు రఘు.

అతని మాటల ప్రభావమైతేనేం,కోరిక బలమైతేనేం ఎమర్జన్సీ బాగానే వర్ధిల్లింది!

ఏడెనిమిది నెలల అనంతరం గోపికి బాబుపుట్టాడు. ఆ వేడుకను ఘనంగా జరిపించాడు గోపీ. రఘుకూడా ఆ వేడుకలో ఆత్మీయుడిలా పాల్గొన్నాడు.

ఆమర్నాడు కోదండం ఇంటిపై పోలీసులు మెరుపు దాడి జరిపారు. అతనింట్లో అనుమానకరమైన వస్తువులు చాలా వున్నట్లు పోలీసులు ప్రకటించారు. కోదండం ఇంటికి సీలు వేయబడింది. కోదండాన్ని అరెస్ట్ చేయడం మాత్రం జరగలేదు.

మర్నాడు రఘు వీర్రాజుతో కలసి గోపి ఇంటికి వెళ్ళాడు. అక్కడ ఇద్దరూ కలిసి బలవంతంగా గోపీ చేత వీలునామా వ్రాయించారు. తనభార్య తన్ను మోసం

చేసిందనీ, ఆమే ఆమె అన్నాకలిసి తన ఆస్తికోసం పథకం వేస్తున్నారనీ ఆ పథకం ఫలించకుండా ఉండగలందులకు తన ఆస్తినంతా తమ్ముడు రఘుపేరున వీలునామా వ్రాస్తున్నాననీ అతనందులో పేర్కొన్నాడు. అదయినాక రివాల్వర్ పేలింది.

రఘుచేతిలో గోపి హతమయ్యాడు.

మర్నాడు కోదండాన్ని పోలీసులు అరెస్ట్ చేశారు. చెప్పుకోదగ్గ సాక్ష్యాధారాలతో అతనే గోపీని హత్య చేశాడని పోలీసులు నిర్ణయించారు.

## 15

బాబుమీద ఎండ పడకుండా అరుణ కొంగుకప్పింది'

అంత ఎండ ఆమెకు అలవాటు లేదు. కొడుక్కు రక్షణ ఏర్పరచినా ఆమెకు రక్షణ లేదు.

ఒక పదినిమిషాల అనంతరం పిల్లవాడు పాలకోసం ఏడ్చాడు.

తన కొంగుకు బిగించి కట్టిన పాలసీసాను మరో పర్యాయం చూసిందామె. నాలుగుగంటల క్రితం అందులోని పాలన్నీ పీల్చిపీల్చి తాగేశాడు బాబు. అరుణ కళ్ళముందు జరిగినదంతా మెదుల్తోంది.

అర్ధరాత్రి పన్నెండు గంటల వేళ నిర్దాక్షిణ్యంగా తనని యిట్లోంచి గెంటివేశాడు రఘు.

"అన్నతో కలసి భర్తని చంపినపాతకి ఈమె! ఈమె జాలిచూపులకు ఎవరూలొంగి పట్టెడన్నంకానీ గుక్కెడు పాలుగానీ యీయవద్దు. అలా ఇచ్చినవారు దారుణంగా శిక్షింపబడతారు" అంటూ ఒక హెచ్చరిక విన్నదామె ఆ మరుక్షణం.

అక్కడొక సైకిల్ రిక్షా. అందులో ఒకమనిషీ, మైకూ. అరుణ ఎక్కడికి వెడితే అక్కడికీ రిక్షా అనుసరి స్తోంది.

ఇప్పుడు సమయం పదకొండు గంటలయింది. నడి వీధిలో ఇప్పటికామె పదకొండు గంటలు గడిపింది.

అరుణకు ఏం చేయాలో తోచడంలేదు. ఆ రిక్షాను తప్పించుకోవాలని చాలా ప్రయత్నించింది. కానీ సఫలీకృతురాలు కాలేకపోయింది.

అడుక్కోవాలని ఆమె అనుకోలేదు. కానీ, ఆ రిక్షా, మైకులో ప్రకటన ఆమెకు సహించరానివిగా ఉన్నాయి. ఆ ప్రకటనకు భయపడి ఆమెను చూడగానే ప్రతివాడూ ఇంటి తలుపులు మూసేస్తున్నారు.

బాబు ఏడ్చాడు. ఆఏడ్పు అరుణ శరీరాన్ని చీల్చుకుని గుండెలలో తగుల్తోంది.

అయిదు నిమిషాలు, పదినిమిషాలు, పావుగంట... బాబు ఏడ్పు ఆగడంలేదు. ఆమెకు క్షణాలు యుగాల్లా గడుస్తున్నాయి. చాలాసేపు ఆలోచించి ఆమె తన ఇంటికి పరిగెత్తింది.

రఘు వీధరుగుమీదనే ఉండి ఆమెను ఆగమని వారించాడు.

“బాబుకి పాలు...” అంది అరుణ బెంకంగా.

“ఛీ-పక్కింటికి పోవే ముష్టిదానా” అనేసి లోపల కెళ్ళి భళ్ళున తలుపులు వేసుకున్నాడతను. ఆమెను ఆ క్షణంలో అవమానంకంటె, బాధ ఎక్కువగా దహించింది.

అక్కణ్నించి కదిలిందామె. రఘు బయటకి వచ్చి

ఇంటికి తాళంవేశాడు. తనూ రిక్షా ఎక్కాడు. రిక్షా ఆమెను అనుసరించింది.

బాబు ఏడ్పు పెరిగినకొద్ది, సమయం గడిచేకొద్ది అరుణలో అహం అలాఅలా నశించిపోసాగింది. ఆమె ఎక్కడయినా ఎవరినయినా ఉద్దేశించి ఏమైనామాట్లాడా లనుకున్నప్పుడల్లా మైకులో పెద్దస్వరంలో ప్రకటన ఎదు రయ్యేది.

అరుణ చివరకు తెగించింది. ఒక హోటల్లో పాలివ్వ నిరాకరించేసరికి బలవంతంగా తీసుకోబోయింది. ఫలితంగా ఆమె నక్కణ్ణించి తరిమి తరిమికొట్టారు.

అరుణకు బాధ పెరిగింగి, తను అన్నివిధాలా జీవితంలో ఓడిపోయింది. రఘుతో విరోధం ఎంత ప్రమాదకరమై నదో ఒక స్త్రీ తనకు చెప్పి హెచ్చరించింది. ఒకఫోటోలో ఆమె కుక్కస్థానంలోవుంది. అదేగతి తనకూ పట్టవచ్చు నని హెచ్చరించిందామె. ఆ హెచ్చరికను తనుపాటించ లేదు. ఫలితంగా భర్తను కోల్పోయింది. అన్న జైలు పాలయ్యాడు. తనబ్రతుకు కుక్కకంటే అన్యాయంగా వీధిపాలయింది.

అన్నింటినీ, అందరినీ కోల్పోయింది తను. ఇక ఈ క్షణంలో అహాన్నిమాత్రం ఎందుకు చంపుకోవాలి? అలా ఆలోచించిన అరుణలో బాబు ఏడుపు వింటూంటే కోపం రగిలింది.

"ముదనష్టపు వెధవకానా—ఎందుకురా ఏడుస్తావ్? తండ్రిని చంపావ్. మామయ్యని జైలుకు పంపావ్. ఇప్పుడు కన్నతల్లిని నడివీధిలో నిలబెట్టావ్, నువ్వుపుట్టి ఎవరు బాగుపడ్డారుగనుక—ఇప్పుడింకా ఏడవడం కూడా ఎందుకు?" అంది కోపంగా.

నడిరోడ్డుమీద ఆమెచుట్టూ మూగారు జనం.

బాబు ఏడుపు ఆపలేదు. అరుణకు కోపంవచ్చిబాబుని కొట్టింది. వాడి ఏడుపు తగ్గలేదు సరికదా, పెరిగింది. ఆమెమళ్ళీ వాడిని కొట్టింది. వాడిస్వరం ఇంకా పెరిగింది. అలా నాలుగయిదుసార్లు జరిగేసరికి గుంపులోంచి చటుక్కున ఒక ముసలాయన ముందుకువచ్చి—

"ఎవరమ్మా — నువ్వీ పసిగుడ్డును కొడుతున్నావు?" అన్నాడు.

అరుణ ఆప్రశ్నకు ఆశ్చర్యంగా ఆయనవంక చూసి "నేను వీడి కన్నతల్లిని. పాలడిగినందుకు కొడుతున్నాను. ఈ మాత్రం అర్థంకాలేదా?" అంది.

"పాలడిగితే కొడతావా? ఏం తల్లివమ్మా నువ్వు?" అన్నాడా ముసలాయన.

"పొద్దుట్నుంచి పిల్లాడికి గుక్కెడు పాలు పట్టించలేక పోయాను. నా పరిస్థితి తెలుసుకోకుండా వాడలా ఏడుస్తుంటే నేనేం చేయగలను?"

"ఆకలేస్తే యేడవకూడదని ఆ పసిపాపకెలా తెలుస్తుందమ్మా?"

"వాడికి తెలియదని నాకూ తెలుసు. కానీ నాముందు వున్న యీ ప్రజ పసిపాపలుకారు, గుక్కెడు పాలతో నాబిడ్డ యేడుపు ఆగుతుందని వాళ్ళనుకోలేదు."

ముసలాయన పరిస్థితి విచారించాడు. మిగతా విశేషాలు తెలుసుకునేలోగా ముందాయన అరుణకు అవసరమైన పాలు ఇప్పించాడు.

రత్నాలో అతను ప్రకటన మళ్ళీ చేయబోయాడు కానీ రఘు వారించాడు. "వద్దు. ఆయన చైర్మన్ నాన్నగారు"

అన్నాడు రఘు మైక్ వ్యక్తితో.

కుర్రాడికి పాలుకొరికాక "వీడికి పాలు సంపాదించడం ఇంత సులువని నాకు తెలియలేదు. తెలిసివుంటే ఇందాక నే వీడిని చావబాది వుండేదాన్ని" అంది అరుణ.

ముసలాయన కళ్ళలో నీళ్ళు తిరిగాయి. —"కన్నకొడుక్కి పాలు సంపాదించటానికి చావబాదడమొక్కటే మార్గమని కన్నతల్లికి తోచేలా ప్రవర్తించే దుర్మార్గులకి అధికారం మద్దతునిస్తోంది. ఈ అన్యాయం ఎంతకాలమో కొనసాగదు. ప్రజలే తిరగబడి దీనికిస్వస్తి చెప్పేరోజు ఎంతో దూరంలో లేదు. అంతకాలమూ నేనే నీకు రక్షణనిస్తాను..."

*　　*　　*

స్వతహాగా దుర్మార్గులైన రఘులాంటివాళ్ళకు ఎమర్జన్సీ పేరుతో తాత్కాలికంగా మద్దతునిచ్చిన పార్టీ ఎన్నికలలో చిత్తుగా ఓడిపోయింది. ముసలాయన మాటలు నిజమయ్యాయి.

రఘు ప్రస్తుతం కులాసాగానే వున్నాడు. తన ప్రవర్తనను కాస్త మార్చుకున్నాడతను. అతనిమీద నేరాలేమీ ఉన్నట్లులేవు. రఘు కారణంగా తన మనుమడు శేషారావుకూడా ఇబ్బందిలో పడతాడని ముసలాయన అరుణను బ్రతిమాలాడు రఘు విషయంలో ఏ విధమైన ఫిర్యాదును చేయవద్దని. ఆమెకు ఆ స్తిలో భాగమిప్పించాడు. కోదండం జెయిలునుంచి విడుదల కావడానికి దోహదం చేశాడు.

అరుణ ఆలోచించింది. 'రఘుమీద ఫిర్యాదుచేసి ప్రయోజనమేమిటి? అందువల్లపోయిన తనభర్త బతికి వస్తాడా?'

శాంతి, సహనం, అహింసలకోసం సత్యాన్ని మరుగున పర్చాలనుకొంటోందిప్పుడు అరుణ.

భారత ప్రజల సహనం ప్రశంసనీయం, అరుణవారిలో ఒక్కతె!

రఘుమళ్ళీ ఊపిరి పీలుస్తున్నాడు. పుంజుకుంటున్నాడు అతనిదివరకటిలా ప్రవర్తించడని అరుణ అనుకుంటోంది. సరిపెట్టుకుంటోంది.

అందుకు కారణం—రాక్షసుల నేం చేయాలో అనేక మంది భారతీయులవలాగే అరుణకు తెలియకపోవడం!

—: ఐపోయింది :—

# నాలుగు హత్యలు చేసిన హంతకుడు!

యస్. గీతారాణి

"మిస్టర్ రవీ! ఈసారినుంచి మంచిగా బ్రతకటం నేర్చుకోండి. మరోసారి పోలీసుల దృష్టిలో పడటానికి ప్రయత్నించవద్దు" జైలర్ అతనికి పర్స్ అందిస్తూ అన్నాడు.

రవి వదనం చిన్నబోయింది.

"సార్! మీరు నమ్మినా, నమ్మకపోయినా ఆ రెండు హత్యలూ నేను చెయ్యలేదు."

రవి బాధగా అని, అతనికి నమస్కరించి, జైలుదాటి బయట ప్రపంచంలోనికి అడుగుపెట్టాడు.

అరచేతులతో ముఖాన్ని తుడుచుకొని, మెల్లగా నడవ సాగాడు.

తను ఇప్పుడు ఎక్కడకి వెళతాడు?

తొలుతగా అతనిలో వుదయించిన ప్రశ్న అది.

తనకు తండ్రీ, అన్నయ్యా వున్నారు. కాని వాళ్ళు ఇప్పుడెక్కడ వున్నారో తెలియదు.

తన వాళ్ళని ఎలాగైనా కలుసుకోవాలి. ఆ ఇద్దరి ఒడిలో తల పెట్టుకొని, కంట తడికారుస్తూ, తనలో ఆవేదన నంతటిని చెప్పుకోవాలి.

ఆ ఇద్దరి అనురాగంలో తను అన్నీ మరచిపోవాలి.

రవి తనవాళ్ళనిగురించి ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

అతని హృదయం ఆప్యాయత, అనురాగంకోసం అలమటిస్తున్నది.

అలా నడుస్తున్నవాడల్లా హఠాత్తుగా ఆగిపోయాడు.

అతనికి కొద్దిదూరంలో బస్ స్టాప్ వుంది.

ఆ బస్ స్టాప్‌లో ఒక యువతి నిలిచివుంది.

ఆమెకు కొద్దిదూరంలో నలుగురు కుర్రవాళ్ళు నిలబడి, కొంటె మాటలతో ఆమెను అల్లరిపెడుతున్నారు.

ఆ యువతి రవిని చూడగానే—

"హలో!" అని తన చేతిని వూపుతూ రవి దగ్గరకి వచ్చింది. ఆమె పలుకరిస్తుంటే అతను తెల్లబోయాడు.

ఆమె ఎవరో తెలియదు రవికి. అలాంటిది ఆమె 'హలో' అని పలకరిస్తుంటే అతను తెల్లబోయాడు.

ఆ యువతి ముఖభావాలు పసిగట్టి—

"క్షమించండి! ఆ రాస్కెల్స్ నన్ను అల్లరిపెడుతున్నారు. నా కారు చిన్న రిపేర్‌లో వుండటంతో ఈ బస్ స్టాప్‌లో బస్‌కోసం నిలబడ్డాను. వంటరిగా వున్నానుకదా అని వాళ్ళు అల్లరి పెడుతున్నారు. అందుకనే మిమ్మల్ని పలకరించాను" అని అంది.

రవి ఏం మాట్లాడలేదు.

ఆ యువతే అన్నది "దయచేసి మా ఇంటిదాకా రండి. లేకపోతే వాళ్ళు వెంటపడగలరు" అని.

"పదండి" అన్నాడు రవి ముందుకు నడుస్తూ.

కొంతదూరంవరకూ ఇద్దరూ మౌనంగానే నడిచారు.

ఆ యువతి మౌనాన్ని భరించలేనిదానిలా పెదవి విప్పింది.

"నా పేరు నీరజ. నేను బి.ఎస్సీ పాసయ్యాను. మీరేం చేస్తున్నారు?" అని ప్రశ్నించింది.

"నా పేరు రవి. ప్రస్తుతం జైలునుంచి విడుదలఅయి వస్తున్నాను" రవి తాపీగా చెప్పాడు.

నీరజ అడుగులు ముందుకు పడలేదు.

అందమైన ఆ యువకుడు జైలునుంచి విడుదలఅయి వచ్చినవాడనుకొంటూంటే ఆమెకు చాలా భయంగాను, ఆశ్చర్యంగా వుంది.

"మీరు ఏం తప్పు చేసారని జైలుపాలయ్యారు?"

"రెండు హత్యలు చేశానని కోర్టు నాకు పదేళ్ళు శిక్ష విధించింది. చేయని నేరానికి ఆశిక్షను అనుభవించక తప్పింది కాదు" రవి ఆ మాటలను ఎంతో తేలికగా అనాలనుకొన్నాడు. కానీ అలా అనలేకపోయాడు.

నీరజ సూటిగా అతని కళ్ళల్లోకి చూసింది.

వేదనంతా అతని పరమే అన్నట్లు ఆవేదన తాలూకు ఛాయలు అతని కన్నులలో కనిపించాయి నీరజకు.

ఎందుకో అతన్ని చూస్తూంటే ఆమె హృదయమంతా అతనిపట్ల సానుభూతితో నిండిపోయింది.

మనసు అతని చరిత్ర వినమని గోల ప్రారంభించింది.

"రవీ! మీ కథ వినాలని వుంది. అలా పార్కు లోనికి వెళదాం రండి" అని అంది.

"నీరజగారూ! గంట క్రితం మీరెవరో నేనెవరో ఒకరికొకరికి తెలియదు. నాపై మీకెందుకింత సానుభూతి."

"గంట క్రితం తెలియకపోయినా ఇప్పుడు తెలిసిందిగా. దయచేసి నామాట కాదనకండి. మీ చరిత్ర వినాలని వుంది."

నీరజ అభ్యర్థిస్తున్నట్లు అంది.

రవికి ఆమె మాటలు చల్లదనాన్ని అందించాయి.

పదేళ్ళ వరకూ అలాంటి అనురాగానికి, ఆప్యాయతకి దూరమైపోయిన అతను ఒక స్త్రీ చల్లని పలుకులకు వెన్నలా కరిగిపోయాడు.

మంత్రముగ్ధుడిలా ఆమెతో పార్కులోనికి నడిచాడు.

ఇద్దరూ ఒక వారగా కూర్చున్నారు.

ఒకరి ముఖాలు ఒకరు చూస్తూ కూర్చున్నారు.

రెండు క్షణాలూ ఆ ఇద్దరిమధ్యా మౌనమే రాజ్యమేలింది.

ఆ తర్వాత రవి గొంతు ఆ మౌనాన్ని చీల్చివేసింది.

## 2

రవి వయసు అప్పుడు ఇరవై సంవత్సరాలు.

అతని తండ్రి నాగరాజారావు. తల్లి రాజ్యలక్ష్మి, అన్న సూర్యం.

నాగరాజరావుకు లోకంలో ఎన్ని చెడ్డగుణాలున్నాయో అన్ని గుణాలు వున్నాయి.

సూర్యం తండ్రికి ఏమాత్రం తీసిపోడు.

ఆ ఇద్దరూ సర్వసాధారణంగా ఇంటి పట్టున వుండరు. సూర్యం రెండుపూటలూ భోజనానికి వస్తూంటాడు. కానీ నాగరాజారావు మూడేసి రోజులు ఇంటికే రాడు.

రవి ఆ ఇద్దరికి భిన్నంగా వుంటాడు.

అతడికి చదువు ధ్యాస తప్పించి, మరొక దానిపై ఆసక్తి లేదు. పెద్ద చదువు చదవాలన్నదే అతని ఆశ.

ఆ ఆశను ధ్యేయంగా పెట్టుకొని కష్టపడి చదువుతున్నాడు. బి.కామ్. సెకండియర్‌లో వున్నాడు రవి.

ఆరోజు కాలేజీకి వెళ్ళాడు.

ఫస్ట్ పిరియడ్ లీజర్, లాస్ట్ పీరియడ్ లీజర్, సెకండ్ పిరియడ్ లెక్చరర్ రాకపోవటంతో రవి ఇంటికి వచ్చేశాడు.

రెండుసార్లు తలుపులు కొట్టినా తలుపులు తెరుచుకోలేదు.

రవి వెనుకవైపుకున్న తల్లి గదిదగ్గరికి వెళ్ళాడు గదిలో నిద్రపోతున్నాదేమోనని.

కిటికీ దగ్గరగా చేర వేసివున్నది.

ఓ చేత్తో కిటికీ తలుపును తోసి, లోపల దృశ్యాన్ని చూసిన అతడి శరీరం వేడెక్కిపోయింది.

ఆ గదిలో మంచంమీద రాజ్యలక్ష్మి, విశ్వనాధం అర్ధనగ్న శరీరాలతో వున్నారు.

"అమ్మా" రవి గావుకేక వేసాడు.

రాజ్యలక్ష్మి కొడుకు గొంతు విని విశ్వనాధాన్ని ప్రక్కకు తోసివేసి, క్రింద కుప్పలా పడివున్న చీరను అందుకొని, అక్కడనుంచి వెళ్ళిపోయింది.

విశ్వనాధం, రవిని చూసి గాబరా పడిపోతూ డ్రెస్ చేసేసుకొని, వీధిలోకి పారిపోయాడు.

రవికి ఆ దృశ్యం భరింపరానిదిగా అనిపించింది.

తన తల్లి అపవిత్రురాలని అనుకొంటుంటే అతనిలో రక్తమంతా సలసలా కాగిపోయింది.

అందుకు కారకుడైన విశ్వనాథాన్ని తలచుకొంటుంటే అతనిలో ఆవేశం పెరిగిపోసాగింది.

ఇంట్లోనికి రాకుండా ఎక్కడెక్కడో తిరిగి చీకటి పడ్డాక ఇంటికి వచ్చాడు.

తల్లి ముఖంలోకి చూడాలంటే చాలా సిగ్గుగా వుంది అతనికి.

రాజ్యలక్ష్మికి కూడా ఇంచుమించు అలాగే వుంది.

ఆ రోజు నాగరాజారావు ఇంటి పట్టునే వుండటంతో రవి, భర్తతో తనని గురించి ఎక్కడ చెప్పేస్తాడో అనే భయం ఆమెకున్నది.

నాగరాజారావుకూడా ఏదోలా వున్నాడు.

సూర్యం ఇంట్లో లేడు.

రవి తండ్రిగదిలోకి వెళ్ళి ఆయన పెట్టె తెరిచాడు.

పెట్లో రెండు రివాల్వర్స్ కనిపించాయి.

రవికి తెలుసు తండ్రి దగ్గర రివాల్వర్స్ వుంటాయని.

అయితే ఆ రివాల్వర్స్ ఆయనదగ్గర ఎందుకు వుంటాయో అతడికి తెలియదు.

ఒకటి జేబులో పడేసుకొని హోటల్ మదీనాకి వెళ్ళాడు.

విశ్వనాథం ఆ హోటల్‌లో బస చేస్తున్నాడు.

రవి రూమ్ నెంబర్ సెవెంటీన్ దగ్గరకు వెళ్ళి మెల్లగా తలుపు తట్టాడు.

ఆ సమయంలో విశ్వనాథం మస్తుగా తాగి వున్నాడు. లైటైనా వేసుకోలేదు.

రవి లోపలకి రాగానే చప్పున తలుపులు మూసేసాడు.

కిటికీలోంచి సన్నటి వెలుగు రేఖలు కొద్దిగాలోపలికి ప్రసరిత మౌతున్నాయి.

ఆ వెలుగులో రవిని గుర్తుపట్టలేకపోయాడు విశ్వనాథం.

"విశ్వనాథం! నీవల్ల నా కన్నతల్లి శీలాన్ని కోల్పోయింది. నా తల్లి పతనం కావటానికి కారకుడవు నీవు. నిన్ను బ్రతక నివ్వను" రవి జేబులోంచి రివాల్వర్ బయటకి తీశాడు.

"బొమ్మ పిస్తోలు చూపించి బెదిరిస్తున్నావా?"

విశ్వనాథం ముద్ద, ముద్దగా మాట్లాడుతూ, తూలుతూ ముందుకు రాబోయేడు. అంతే!—

విశ్వనాథం చావుకేక పెట్టి, గుండెల్ని అరచేత పట్టుకొని క్రిందకు ఒరిగిపోయాడు.

రవి ఖంగారుగా కిటికీవైపు చూసాడు.

ఒక ఆకారం వెనుతిరిగి పారిపోతున్నది.

రవి చప్పున లైట్ వేసాడు.

గది నిండా వెలుతురు నిండిపోయింది.

ఆ వెలుగులో విశ్వనాథం శవం రవి కళ్ళకు కనిపించింది.

గుండెల లోంచి కారిన రక్తం నేలపై పడివుంది.

ఆ దృశ్యం చూసి రవి కొయ్యబారిపోయాడు.

ఐదు నిముషాలవరకూ అతను స్తబ్దుగా నిలిచిపోయాడు.

తనకన్నా ముందు విశ్వనాథాన్ని ఎవరో చంపేసారు.

తను పేల్చే లోపలే అతన్ని ఎవరో కాల్చేసారు.

మైగాడ్ తను హంతకుడు కాడు.

ఆవేశంలో హత్య చెయ్యాలనే వచ్చాడు కాని, ఆ భగవంతుని దయవల్ల తను హంతకుడు కాలేదు.

కానీ తను ఇంకా శవందగ్గరే వుంటే, తనని ఎవరైనా చూస్తే... రవికి ఆలోచించటానికి మనస్కరించలేదు.

రివాల్వర్ జేబులోనికి తోసి, తలుపు తీసాడు.

ఎదురుగా హోటల్ మానేజర్ ఇంకా చాలామంది నిలిచివున్నారు. వాళ్ళనందరినీ చూడగానే రవి గుండెలు భయంతో దడదడలాడాయ్. హోటల్ మానేజర్ అందరితో అంటున్నాడు.

"అతను నాతో చెప్తే నేను మొదట నమ్మలేదండీ. రూమ్ నెంబర్ సెవెంటీన్ లోంచి చావుకేక వినపడిందని చెప్పాడు. నిజమో, కాదో అని మిమ్మల్ని వెంటబెట్టుకొచ్చాను. అతను చెప్పింది కరెక్టే. ఈ వెధవ విశ్వనాథంగార్ని చంపేసాడు. పోలీస్ రిపోర్ట్ ఇవ్వాలి" అని.

రవి భీతిగా చూసాడు.

పిచ్చి ఆవేశంలో హత్య చెయ్యాలనే వచ్చాడు.

తీరా అది తను చెయ్యని నేరం అని తెలుసుకొనేసరికి అతనికి తను నిర్దోషినని నిరూపించుకోవాలనే తపన చెలరేగింది.

అయితే, అతను హత్య చెయ్యలేదని ఎంతలా చెప్పినా ఎవ్వరూ వినిపించుకోలేదు.

పోలీసులు రావటం అతన్ని అరెస్ట్ చెయ్యటం జరిగిపోయింది.

రాజ్యలక్ష్మి కూడా దారుణంగా మరణించటంతో పోలీసులు ఆ ఇద్దరి చావులని కూపీ తీసారు.

విశ్వనాథానికి, రాజ్యలక్ష్మికి అక్రమ సంబంధంవుందని తెలుసుకొన్నారు.

సూర్యం కాని, నాగరాజావుకాని ఆ సమయంలో

ఇంట్లో లేకపోవటంతో, రవి ఆ ఇద్దరి సంబంధాన్ని తెలుసుకొని, ముందు ఆమెను నంపి, ఆ తరువాత విశ్వనాథాన్ని చంపేసాడని నిర్ణయించారు.

విశ్వనాథం గుండెల్లో వున్న గుండు రవి దగ్గరవున్న రివాల్వర్‌లో వున్న గుండులాంటిదే కావటంతో అతనే హంతకుడని కోర్టు అతనికి పదేళ్ళు శిక్ష విధించింది.

# 3

"ఇది నీరజా నా చరిత్ర. చేయని నేరాలకు పదేళ్ళు శిక్ష అనుభవించాను. నిర్దోషి శిక్షను అనుభవించాడు దోషి ఎక్కడో హాయిగా జీవిస్తున్నాడు. ఏనాటికైనా నాపై హంతకుడనే ముద్ర వేసిన ఆ పాపాత్ముడు నాకు తారసపడితే, వాడిని కోర్టులో నిలబెట్టి నాపై వున్న ముద్రని చెరిపివేసుకొంటాను. ఇదే నాకు మిగిలిపోయిన కోర్కె."

నీరజ అతని వైపు జాలిగా చూసింది.

అతని చరిత్ర విన్నాక ఆమెకు అతనిపై అంతులేని అభిమానం ఏర్పడింది.

"రవీ! జరిగిపోయినదంతా మరచిపోండి. ఇప్పుడు మిమ్మల్ని మా నాన్నగారి దగ్గరకు తీసుకువెళ్ళి వుద్యోగం ఇప్పించమని అడుగుతాను. నాన్నగారు నా మాటను కాదనరు" అని అంది.

రవి కళ్ళు అమితంగా వెలిగిపోయాయి.

చింతలే తన జీవితానికి మిగిలిపోయాయి కాబోలుననుకొన్నాడు. కానీ నీరజ దయవల్ల తన జీవితం చిత్రమైన మలుపు తిరుగుతున్నది.

రవికి నీరజ తన పాలిట దైవంలా కనిపించింది.

నీరజ అతన్ని ఇంటికి తీసుకువెళ్ళింది.

తండ్రికి అతన్ని తన స్నేహితుడిగా పరిచయం చేసి యేదయినా ఉద్యోగం యిప్పించమని కోరింది.

గోపాలరావుగారికి కూతురంటే ప్రాణం. ఒక్కర్తే కావటం మూలాన ఆమె యేదికోరినా కాదనలేరు.

ఆయన కూతుర్ని దగ్గరగా తీసుకొని "చూడమ్మా! నా ఫ్యాక్టరీలో యేజాబ్స్ ఖాళీగాలేవు. మన మానేజర్ ఇంకో నాన్నాళ్ళు పోయాక రిజయిన్ చేసి తన స్వంతవూరు వెళ్ళిపోతానన్నాడు. అంతవరకు రవిని ఖాళీగావుంచడం దండగ. మనసారధి దగ్గర సెక్రటరీగా పనిచెయ్యమను" అని చెప్పారు.

ఆయన మాటలకు రవికళ్ళు చెమర్చాయి.

రెండు చేతులూ జోడించి ఆయనకు నమస్కరించాడు.

# 4

సారధిగారు చాలా డబ్బుగల వ్యక్తి.

ఆవూరిలో ఆయనకు మంచిపేరువుంది.

ఆయనకి కాంతి ఒక్కతే కూతురు.

బి. ఎ. చదువుకున్నది.

రవి, సారధిగారి దగ్గర పనికి కుదిరాక ఆయనకి కొంత శ్రమతగ్గింది. చాలాపనులు రవే చూసుకుంటున్నాడు.

నీరజా, అతను రోజూ సాయంత్రాలు పార్కులో కలుసుకొంటున్నారు. అందం, మంచి మనసుగల రవిని ప్రేమిస్తోంది నీరజ.

అతనూ ఆమెను ఆరాధించటంతో ఇరువురు మనసులు ఒకటయాయి. తన జీవితం ఎలా వుంటుందో అని కృంగి పోయిన రవి ఇలా అనుకోని మలుపు తిరగటంతో మంచికి

యేనాడూ వంచన జరగదని, మంచివాడు యేనాడూ చెడిపోడని అనుకున్నాడు. తనతండ్రికోసం, అన్నకోసం వెదికాడు. కాని అతనిశ్రమ ఫలించలేదు. వాళ్ళిప్పుడు ఎక్కడున్నారో ఎవరూ చెప్పలేకపోయారు.

ఆరోజు రవి, నీరజతో పార్కుకు వెళ్ళాడు.

ఆమెతో ఒకగంట గడిపి తన ఇంటిదారి పట్టాడు.

రోడ్ మీద మెల్లగా నడుస్తున్నాడు.

అతని మనసంతా ఆనందమయమై వుంది.

అలా తాపీగా నడుస్తున్న అతని ప్రక్కగా ఒక ఎర్రటి కారు వచ్చి ఆగింది.

కారులోంచి ఒక వ్యక్తి క్రిందకుదిగి "హాలో మిస్టర్ రవీ!" అని పిలిచాడు.

రవి ప్రక్కకు తిరిగి ఆ వ్యక్తిని చూసి "మీరూ" అంటూ ఆపేసాడు.

ఆ వ్యక్తిని అంతకుముందు చూసినట్లుగా గుర్తయినా లేదు. అలాంటప్పుడు అతను అంత స్నేహంగా పలుకరిస్తుంటే రవి చాలా ఆశ్చర్యపోయాడు.

"రవీ! నీతో మాట్లాడాలి. కారెక్కు."

"నాకు మీరెవరో తెలియదు. నాతో ఏం మాట్లాడతారు?"

"నీకు మాగురించి తెలియకపోవచ్చుకాని, నీ గురించి మాకు బాగా తెలుసు. కారెక్కు."

అతని స్వరం అధికారయుక్తంగా వినిపించింది రవికి. తనని గురించి అతడికి ఏం తెలుసో తెలుసుకోవాలని పించింది.

"పదండి" అని అన్నాడు.

ఆ వ్యక్తి కారు డోర్ తెరచి రవిని ఎక్కమన్నాడు.

అతను కారు ఎక్కాక తను ఎక్కి కారుని పోని చ్చాడు. పార్కు ముందు కారు ఆపి క్రిందకు దిగాడు.

రవి డోర్ తెరచుకొని కారుదిగి ఆ వ్యక్తి ముఖంలోకి సూటిగా చూసాడు.

"కమాన్" అంటూ అతను పార్కులోపలికినడిచాడు.

ఇద్దరూ ఎవ్వరూలేనిచోటు చూసుకునికూర్చున్నారు.
"నాతో ఏం మాట్లాడాలి?" రవి ముందుగా అడిగాడు.

"నువ్వు ఒక హత్య చెయ్యాలి! అందుకు ప్రతిఫలంగా ఇరవై వేలు ముట్టచెప్తాను" ఆ వ్యక్తి నింపాదిగా అన్నాడు.
రవి దిగ్గున లేచినిలబడ్డాడు.
అతనికళ్ళు రక్తారుణిమను దాల్చాయి.

ఆవేశంతో మెడక్రింద నరాలు పొంగాయి.

"నేనేం కిరాయి హంతకుడిననుకొంటున్నావా? లేక పోతే పిచ్చాసుపత్రి నుంచి పారిపోయి వచ్చావా?"

రవి తీవ్రస్వరాన అంటూంటే ఆ వ్యక్తి చిద్విలాసంగా నవ్వాడు.

"పూర్ రవీ! నీ చరిత్ర నాకు తెలియదనుకోకు. నువ్వు సెంట్రల్ జైలునుంచి విడుదల అయ్యావని తెలుసు. రెండు హత్యలు కూడా చేసావని తెలుసు. హత్యలు చెయ్యటం అలవాటు చేసుకొన్నవాడు హత్య చెయ్యటానికి భయపడ కూడదు. ఇద్దర్ని అతి తేలికగా చంపినవాడివి. మరో మనిషిని వంకాయ కోసిపారేసినట్లు కో సెయ్యగలవు!"

"యూ షటాప్! మరొక్కసారి హత్య పేరు ఎత్తితే

నిన్ను ఇక్కడే గొయ్యితీసి పాతిపెట్టేస్తాను" రవి చెంద్రనిప్పులు చెరిగే కళ్ళతో అతన్ని చూస్తూ అన్నాడు.

"గుడ్ అలాంటి సాహసం కలవాడే కావాలి నాకు. నీలో సాహసం మోతాదు మించివుంది. అందుకే నువ్..."

"మిస్టర్! మరొక్కసారి మాట్లాడితే పళ్ళు గవ్వల్లా రాలిపోతాయి జాగ్రత్త!" రవి వుద్రేకంగా అని ముందుకు నడవబోయాడు.

"రవీ! నువ్వెంతో, నీ బ్రతుకెంతో తెలుసుకొని మరీ మాట్లాడు. గోపాలరావుతో, సారధితో నీ చరిత్ర నంత టిని చెప్తే, అప్పుడు నీగతి ఏమౌతుందో ఆలోచించుకో."

రవిలో ఆవేశం చప్పున చల్లారిపోయింది.

పతనమైన తన గత చరిత్ర కళ్ళముందు మెదిలి కలవర పెట్టింది.

"రవీ! నువ్వు నన్ను కాదంటే రేపే నీ చరిత్ర వారి ముందు వుంచుతాను."

రవి ఆ వ్యక్తి ముఖంలోకి చూసి "మిస్టర్! ఒకసారి చెయ్యని నేరానికి ఘోరంగా శిక్షని అనుభవించాను. చదువుకొని వుజ్వలమైన భవిష్యత్‌లోకి అడుగుపెట్ట వలసిన వయసంతా జైల్లో గడిపాను. ఇప్పుడు హత్యచేసి నా అంతరాత్మముందు దోషిగా నిలబడి, పతనం కాలేను. నాకు నీతిగా బ్రతకటమంటే ఇష్టం! ఆ నీతికోసం నా ప్రాణాలైనా ఆహుతి చేయగలను. కనుక నన్ను వదిలెయ్" అన్నాడు.

"రవీ! నీ చరిత్ర సారధితో చెప్తే నువ్వు నిరుద్యోగివి అవుతావు."

"మీ ఇష్టం!"

రవి మెల్లగా అనేసి అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

ఆ వ్యక్తి రవి గుండె ధైర్యానికి విస్తుపోయాడు. కారెక్కి స్టార్ట్ చేసాడు.

పావుగంట ప్రయాణం చేసాక కారు ఒక బంగళా ముందు ఆపాడు.

బంగళా ముందు గూర్ఖా కాపలావున్నాడు.

ఆ వ్యక్తిని చూడగానే సలాం చేసి గేటు తెరిచాడు.

ఆ వ్యక్తి కారుని లోపలకి పోనిచ్చి ఒక వారగా ఆపి క్రిందకు దిగాడు.

కాలింగ్ బజర్ నొక్కాడు.

రెండు నిముషాలలో తలుపులు తెరచుకొన్నాయి.

ఆ వ్యక్తి తలుపులు తీసిన మనిషిని చూసి చిన్నగా మందహాసం చేసి, ఆ హాలుదాటి ఒక గదిలోకి వెళ్ళి, ఆ గదిలోంచి మరో హాలులోకి వెళ్ళాడు. ఆ హాలులో చాలామంది వ్యక్తులు వున్నారు.

వారిలో ఒక వ్యక్తి ఫుల్ బ్లాక్ డ్రస్ వేశాడు. ముఖానికి నల్లటి మాస్క్ తొడిగాడు.

ఆ మాస్క్ తొడుక్కున్న వ్యక్తి లోపలికి ప్రవేశించిన వ్యక్తిని చూసి, "చలం! నీతో రవి రాలేదా?" అని అడిగాడు.

"లేదు బాస్! వాడికి చాలా పొగరు. నేను ఎంత మంచిగా మాట్లాడినా వాడు చాలా పెడసరంగా మాట్లాడాడు."

చలం వినయంగా చెప్పాడు.

"చలం! అలాంటి పొగరుబోతు మనకి చాలా అవసరం. రవిలాంటి వాడే నూర్యాన్ని తేలికగా హత్య

చెయ్యగలడు. ఆ సూర్యంగాడు బ్రతికివుండగా మనం ముందుకుపోలేం. సూర్యం చావాలంటే రవి మన దారికి రావాలి. అలాంటి వాడిని ఎలా లొంగదీసుకోవాలో నాకు బాగా తెలుసు.

నువ్వు శాంతికి రవిపేర ప్రేమలేఖ వ్రాయి. అది కాలేజీ ఎడ్రస్‌కి పోస్టు చెయ్. తమ క్రింద పనిచేస్తున్న వాడు లవ్ లెటర్ వ్రాసినందుకు శాంతి, రవితో తగవు పడుతుంది. దానిఫలితం వాడి వుద్యోగం పోతుంది. ఆ తరువాత శాంతిని చంపెయ్. ఒకసారి నేరస్తుడిగా పోలీస్ రికార్డులోకి ఎక్కిన రవిని అనుమానించి తీరుతారు. అప్పుడు వాడు మనకి దాసోహం అంటాడు."

ఆ మాస్క్ తొడుక్కున్న వ్యక్తి చెప్పాడు.

చలం బాస్ చెప్పింది చెయ్యటానికి వెళ్ళిపోయాడు.

# 5

శాంతి లైబ్రరీ రూమ్‌లో వుండగా శాంతి స్నేహితురాలు ఒక కవరు తీసుకొచ్చి, శాంతికి యిచ్చింది.

తనకు లెటర్ ఎవరు వ్రాసారా అని ఆలోచిస్తూ, ఆ అమ్మాయి వెళ్ళిపోయాక కవరు చింపి, లోపల కాయితాన్ని బయటకు తీసి చదివింది శాంతి.

"డియర్ శాంతీ!

నీవు లేనిదే నేను బ్రతకలేను. నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. మీ నాన్నగారి దగ్గర పని చేస్తున్నాను కాబట్టి, ఆయనకి నాపై అభిమానం వుండవచ్చు. నువ్వు సరేనంటే నీ సౌందర్యాన్ని నా స్వంతం చేసుకుంటాను.

ఇట్లు

నీ ప్రేమికుడు, రవి."

శాంతి కళ్ళు అగ్నిగోళాలయ్యాయి.

ఒక మామూలు వ్యక్తి, అందునా తమక్రింద పనిచేసే వాడు తనకు ప్రేమలేఖ వ్రాయటమా అని అనుకొంటుంటే ఆమెకు రవిమీద చెప్పలేనంత కోపం, అసహ్యం కలగసాగాయి.

శాంతి ఆ లెటర్ బుక్‌లో పెట్టేసుకొని, యింటికి వచ్చేసింది.

ఆమె ఇంటికి వచ్చేసరికి రవి, సారధిగారూ మాట్లాడుకొంటున్నాడు.

రవి తనగురించి వివరంగా ఆయనతో చెప్పాలనుకొని "మీతో ఒక ముఖ్యవిషయం చెప్పాలండీ" అని అన్నాడు.

శాంతి ఆ మాటల్ని మరోలా అర్థంచేసుకొన్నది.

రవిని చూడగానే ఆమె మరింత రెచ్చిపోయింది.

"డాడీ! ఈ ఇడియట్‌ని ముందు బయటకి గెంటండి" అంది ఆవేశంగా.

రవి తెల్లబోయాడు.

"నేనేం చేశాను శాంతీ!" అని అడిగాడు కలవరంగా.

శాంతి తన బుక్‌లోంచి లెటర్ తీసి అతని ముఖాన కొట్టి "మా క్రింద పనిచేసే వాడివి. నాకు ప్రేమలేఖ వ్రాసేటంతటి ధైర్యం నీకెలా వచ్చింది?" అని అంది.

రవి అయోమయంగా ఆ లెటర్ అందుకుని చదివాడు.

అది చదివిన అతని ముఖం తెల్లగా పాలిపోయింది.

"ఇది నేను వ్రాయలేదు. నన్ను నమ్మండి" అన్నాడు రవి బాధగా.

సారధిగారు, రవి చేతిలో లెటర్ అందుకొని చదివి వుగ్రుడైపోయాడు.

"రవీ! గోపాలరావు మీద గౌరవంకొద్దీ నిన్ను నా సెక్రటరీగా పెట్టుకొన్నాను. నువ్వు దురాశాపరుడివి. నా కూతుర్ని పెళ్ళాడి, నా ఆస్తిని కాజెయ్యాలని చూస్తున్నావు. నీలాంటి వాడు నా దగ్గరవుండ తగడు. నిన్ను ఈ రోజునుంచే పనిలోంచి తీసివేస్తున్నాను వెళ్ళు" అని గర్జించాడు.

"సార్! నా మాట నమ్మండి. శాంతిగారిమీద నా కలాంటి చెడు అభిప్రాయం ఎప్పుడు లేదు. నేను అంటే కిట్టని వాళ్ళు ఈ పని చేసివుంటారు. దయచేసి చేయని తప్పుకు నన్ను శిక్షించకండి సార్!" రవి పూడుకుపోయిన కంఠంతో అన్నాడు.

"ఐ సే యూ గెటౌట్!" శాంతి గట్టిగా అరిచింది.

రవి ముఖం చిన్నబోయింది.

"శాంతీ! దురదృష్టం నన్ను వరించింది. అందుకే నిందల పాలవుతున్నాను" అని నీరసంగా బయటకి వచ్చేసాడు.

పది గంటలవరకూ ఎక్కడెక్కడో తిరిగి, తిరిగి పది గంటలకు హోటల్ కార్తికేయలో భోజనం చేసి, ఇంటికి వచ్చేసి, మంచంపై వాలిపోయాడు.

కళ్ళు మూస్తే తన జీవితమంతా చీకటేనేమో అనే భయం అతన్ని నిద్రపోనివ్వటం లేదు. మంచి మనుషులకి మనుగడే లేదా? అనే ఆలోచన అతన్ని ప్రశాంతంగా వుండనివ్వటం లేదు.

# 6

రవి వుదయాన్నే నిద్రలేచి, తన పనులన్నీ ముగించు కొని, నీరజ ఇంటికి బయలుదేరబోతుండగా సారధిగారి నౌకరు వచ్చాడు.

"ఏం, ధర్మన్నా! ఇలా వచ్చావు?"

మళ్ళా తనని పనిలోకి రమ్మని నౌకరుచేత కబురు పంపించారు కాబోలని, ఆశపడ్డాడు రవి.

"మిమ్మల్ని అయ్యగారు రమ్మన్నారండీ" అని చెప్పాడు వాడు.

రవి హుషారుగా వాడితో సారధిగారి బంగళాకు వెళ్ళాడు.

బంగళా ముందు పోలీస్ జీప్ వుండటం చూసి, రవి భృకుటి ముడిపడింది. ఏదో భయం అతన్ని ఆవరించింది.

హాలులోకి అడుగుపెట్టి వికృతంగా వున్న శాంతి శవాన్ని చూసి స్థాణువులా నిలిచిపోయాడు.

ఆమె ముఖమంతా దేనితోనో చెక్కి వేయబడి వుంది. చేతులమీద పళ్ళగాట్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి. పోలీస్ డాక్టర్ ఇన్స్పెక్టర్‌తో అంటున్నాడు.

"హత్య సరిగ్గా పది గంటలకు జరిగింది. ఈ అమ్మాయిని ఎవరో రేప్ చేసారు. ఆ తరువాతే చంపేసారు" అని.

"సారధిగారూ! శాంతి ఒంటరిగా ఎక్కడైనా వెళ్ళిందా?" అని ప్రశ్నించాడు ఇనస్పెక్టర్.

అదే సమయంలో సారధి గారు, రవి రావటం చూసారు.

"అదుగో ఇనస్పెక్టర్ వాడే. ఆ దుర్మార్గుడే నా శాంతిని ఘోరంగా చంపేసాడు" అని అరిచారు ఆయన.

ఇనస్పెక్టర్ దృష్టి రవిమీద పడి నిలిచిపోయింది.

రవి లోలోన వణికిపోయాడు.

"సారధిగారూ! ఈ రవి ఈ మధ్యే జైలునుంచి విడుదలయి బయటకి వచ్చాడు. ఇతను రెండు హత్యలు చేసి,

పదేళ్ళు శిక్ష అనుభవించాడు. ఇతనికి మీకూ ఏం పరిచయం ఇతను మీ శాంతిని చంపటానికి గల కారణం చెప్పండి'' ఇనస్పెక్టర్, సారథిగార్ని అడిగాడు.

''నా మిత్రుడొకడు వీడు మంచివాడని చెప్తే, నా సెక్రటరీగా పెట్టుకొన్నాను. నా ఆస్తిని చూసి ఆశపడి నిన్న శాంతికి ప్రేమలేఖ వ్రాసాడు. శాంతి నాకు చూపించింది అది. ఇద్దరం రవిని వుద్యోగంలోంచి తీసివేసాం. జరిగినదంతా శాంతి మనసుని చికాకు పరచింది. ఫస్ట్‌షోకి వెళతానని చెప్పి, పిక్చర్‌కు వెళ్ళింది. అంతే మళ్ళీ ఇప్పుడు ఇలా కనిపించింది.

నేను స్నానం చేస్తున్నప్పుడు ఎవరో వ్యక్తి ఒక పెట్టి తెచ్చి వెళ్ళిపోయాడని నౌఖరు చెప్పాడు. నా స్నానమయ్యాక తాళం కొట్టి చూస్తే, శాంతి శవం కనిపించింది. శాంతి తనకు దక్కలేదన్న కసితో రవి నా బిడ్డను చంపేసాడు'' ఆయన కన్నీటితో అన్నారు.

''రవీ! నీ సమాధానం ఏమిటి?''

''ఇనస్పెక్టర్! రాత్రి పది గంటలకు నేను హోటల్ కార్తికేయలో భోజనం చేస్తున్నాను. ఆ హోటల్ మానేజర్‌కు నేను సారథిగారి సెక్రటరీనని బాగా తెలుసు. మీరు ఆయనకి ఫోన్ చేసి కనుక్కోండి.''

రవి అలా అనేసరికి ఇనస్పెక్టర్ ఫోన్ దగ్గరకి నడిచి కార్తికేయ మానేజర్‌కు ఫోన్ చేసి, రవి చెప్పినది నిజమో, కాదో తెలుసుకొన్నాడు. రవి చెప్పింది కరక్టే.

ఇనస్పెక్టర్ ఫోన్ పెట్టేసి ''రవీ! సరైన సాక్ష్యం లేకపోవటంతో నిన్ను అరెస్ట్ చెయ్యలేకపోతున్నాను. అయినా నిన్ను ఈ రోజునుంచి నీడలా వెంటాడుతాను. జాగ్రత్త!'' అని అన్నాడు.

రవి ముఖంబాధగా పెట్టాడు.

ఆ తరువాత రవి, నీరజ ఇంటికి వెళ్ళాడు.

గోపాలరావుగారు వూరిలో లేరు. ఏదో పనిమీద బొంబాయి వెళ్ళారు.

నీరజ ఒక్కర్తే వుంది.

రవి జరిగినదంతా చెప్పాడు.

"నీరజా! ఆ వ్యక్తే శాంతిని చంపి వుండవచ్చు. అతన్ని గురించి చెప్పినా ఎవ్వరూ నమ్మరు. కారణం నేను హంతకుడనే ముద్ర వుంది" అని అన్నాడు వేదనగా.

నీరజ అతన్ని తన గుండెలకుహత్తుకొంది. "రవీ! నాన్న గారు వూరినుంచి రాగానే మన ప్రేమను గురించి చెప్తాను. నిన్ననే మేనేజర్ వెళ్ళిపోయాడు. నీకు ఆ పోస్ట్ ఇప్పిస్తాను. మనం తొందరగా పెళ్ళి చేసేసుకొందాం."

నీరజ మాటలు అతన్ని శాంతపరచాయి.

# 7

గోపాలరావుగారు కూతురు చెప్పినదంతావిని, "నీరజా! రవి వుత్తముడే. అతను నీ భర్తగా అన్నివిధాల సరిపోతాడు" అని అన్నారు.

శాంతి మరణం రవివల్లే సంభవించిందని ఆయనకి తెలియదు.

సారధిగారు కూతురు పోవటంతో తన అన్న ఇంటికి వెళ్ళిపోయారు.

గోపాలరావుగారు వూరినించి రాగానే శాంతి చనిపోయిందని, సారధిగారు వూరువిడిచి వెళ్ళిపోయారని మాత్రమే చెప్పింది నీరజ.

అందుకే ఆయన దృష్టిలో రవి మంచివాడే.

నీరజ తండ్రి తను పెళ్ళికి అంగీకరించటంతో ఎంతగానో పొంగిపోయింది. ఆ మర్నాడు రవిని కలసి తండ్రి తమ పెళ్ళికి అంగీకరించాడని చెప్పింది.

రవి ఆనందం వర్ణనాతీతం.

ఆ మర్నాడే అతను గోపాలరావుగారి ఫ్యాక్టరీ మేనేజరయ్యాడు.

సాయంత్రం ఫ్యాక్టరీ పని కాగానే రవి ఇంటికి వస్తున్నాడు. రోడ్ మీద నడుస్తుండగా అతని ప్రక్కగా ఎర్రటి కారు వచ్చి ఆగింది. ఆ ఎర్రకారు చూడగానే రవి గుండెలు దడదడ లాడాయి. అదే కారు ఆరోజు తన ముందు ఆగింది. ఆ కారులో వ్యక్తి...రవికి వూహించటానికే భయం వేసింది.

గబ, గబా ముందుకు నడిచాడు.

చలం కారులోంచి క్రిందకు దిగి, రవి చెయ్యిపట్టి ఆపాడు.

"రవీ! నీతో మాట్లాడాలి. కారెక్కు."

"మళ్ళీ హత్యను గురించేనా? అదే అయితే నేను వినను."

చలం ఎర్రగా చూసాడు.

"రవీ! చాలామూర్ఖంగా ప్రవర్తిస్తున్నావు. నా మాట వినకపోతే పరిణామం చాలా ఘోరంగా వుంటుంది."

"నేను నీకు ఏం అపకారం చేసానని ఇలా నన్ను బాధ పెడుతున్నావు. నువ్వు ఏం చేసినా నేను హంతకుడిని కాలేను. కాను. ఏనాటికైనా మంచి జరగదా అనే ఆశతో జీవిస్తున్న నేను పతనం కాలేను" అని చెప్పి వడివడిగా ముందుకు వెళ్ళిపోయాడు రవి.

# 8

గోపాలరావుగారు ఫ్యాక్టరీనుంచి రాగానే నౌకరుని "రవీ, నీరజా సినిమానుంచి ఇంకా రాలేదా?" అని అడిగారు.

"ఇంకా రాలేదు. కానీ అయ్యగారూ! ఇందాకల ఒక మనిషి ఒక పెట్టె తీసుకొచ్చి ఇచ్చాడు."

గోపాలరావుగారు భృకుటి ముడిచి "ఏదీ పెట్టె" అని అడిగారు.

నౌకరు ఆయనను పెట్టివున్న గదిలోకి తీసుకు వెళ్ళి చూపించాడు.

"ఏమని చెప్పాడా మనిషి?" ఆయన అందులో ఏముందో వూహించటానికి ప్రయత్నిస్తూ అడిగారు.

"మీ అయ్యగారు రాగానే తాళం పగలగొట్టి, లోపల వున్న వస్తువును చూసుకోమను, అని చెప్పాడు బాబూ."

గోపాలరావుగారి మనసు కీడుని శంకించింది.

నౌకరుచేత తాళం పగులగొట్టించి, పెట్టె మూత తెరచి చూసాడు. పెట్టెలోపల నీరజ శవం ఆయన కళ్ళబడింది.

కూతురి శవాన్ని చూడగానే ఆయన గుండెలు బాదు కొంటూ ఏడవసాగారు.

నౌకరు పరుగున వెళ్ళి ఇనస్పెక్టర్‌కు ఫోన్ చేసి, జరిగినదంతా చెప్పాడు.

ఐదు నిముషాలలో ఇనస్పెక్టర్ గోపాలరావుగారి ఇంటికి వచ్చాడు.

ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్ట్స్... డాక్టర్, ఫోటో గ్రాఫర్, తదితరులంతా తమ, తమ పనులను చకచకా ముగించారు.

శాంతిలాగే నీరజకూడా రేప్ చెయ్యబడి, మరణించిం దని డాక్టర్ చెప్పాడు.

"గోపాలరావుగారూ! మీ అమ్మాయి ఒంటరిగా బయ టకి వెళ్ళిందా?" ఏడుస్తున్న ఆయన్ని ప్రశ్నించాడు ఇనస్పెక్టర్.

"మా రవితో సినిమాకు వెళ్ళింది. ఆ తరువాత ఇలా కనిపించింది" ఆయన కన్నీటితో అన్నారు.

"రవి అంటే సారధిగారి దగ్గర సెక్రటరీగా పని చేశాడు అతనేనా?"

ఆయన అవునన్నట్లు తల వూపారు.

"గోపాలరావుగారూ! కేసు మబ్బులా విడిపోయింది. ఆ రవి లేడీ కిల్లర్. ఆడపిల్లలని అనుభవించి చంపటం అత నికి అలవాటు. అతనే మీ అమ్మాయిని చంపాడు" అని అన్నాడు ఇనస్పెక్టర్.

"రవా? అతను మా అమ్మాయిని ప్రేమించాడే. అలాంటిది అతను నీరజను చంపటమా? నో... నేను నమ్మను" ఆయన నమ్మలేనట్లుగా అన్నారు.

ఇనస్పెక్టర్ అతని గత చరిత్రని చెప్పి, ఆయన దగ్గర రవి ఇంటి అడ్రస్ తెలుసుకొని, అతని ఇంటికి బయలు దేరాడు.

ఆసమయంలో రవి ఏదో బుక్ చదువుకొంటున్నాడు. ఎందుకో యధాలాపంగా కిటికీలోంచి చూసాడు.

పోలీస్ జీప్ అతని ఇంటివైపే దూసుకు వస్తున్నది.

రవి గుండెలు దడ, దడలాడాయి. అతని మదిలో చలం మెదిలాడు. మళ్ళీ ఏదో ఘోరం జరిగిపోయిందని, పోలీసులు తనని నేరస్తునిగా ఎంచి, అరెస్ట్ చెయ్యటానికే వస్తున్నారని గ్రహించాడతను.

పెరటిలోంచి వెనుకవీథిలోకి చేరుకొని, తిన్నగా నీరజ ఇంటికి వెళ్ళాడు. నీరజ ఇంటిముందు చాలామంది జనం మూగివున్నారు.

గుంపునంతటిని తోసుకు వెళ్ళి ఏం జరిగిందో తెలుసుకోవాలని అనుకొన్నాడు.

కానీ ఎవరో ఆ గుంపులోంచి "వాడు రెండు హత్యలు చేసాడట ఎప్పుడో పదేళ్ళు జైలులో వుండివచ్చాడట. కాంతిని కూడా వాడే చంపేసాడట. ఇప్పుడు నీరజను చంపేశాడు. ఇనస్పెక్టర్ గారు వాడి ఇంటికి వెళ్ళారట అరెస్ట్ చెయ్యటానికి" అని అంటుంటే అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

తనుకాని ఎవరి కళ్ళకైనా కనిపిస్తే మళ్ళీ జైలు జీవితమే అనుకొని వెనుతిరిగి వచ్చేశాడు. కొద్దిదూరం వెళ్ళగానే అతనిప్రక్క ఎర్రకారు వచ్చి ఆగింది.

రవిని చూడగానే చలం మందహాసం చేశాడు.

"నువ్వు చెప్పిన పని చెయ్యటానికే నిర్ణయించుకొన్నాను. పోలీసులు నా కోసం గాలిస్తున్నారు ఇప్పుడు. పద, వివరంగా మాట్లాడుకుందాం!" అంటూ కారులో ఎక్కికూర్చున్నాడు రవి.

పావుగంట తర్వాత చలం కారుని తమ బంగళా ముందు ఆపాడు.

గూర్ఖా చలాన్ని, రవిని పరీక్షగా చూసి గేటు తెరిచాడు.

కార్ను లోపలికి పోనిచ్చి, ఒక వారగా ఆపి, ఇద్దరూ క్రిందకు దిగి బంగళా లోపలికి వచ్చారు.

రవి చూపులు హాల్లోవున్న అందరి మీదా వరసగా

పడి, ఆఖర్న మాస్క్ తొడుక్కున్న వ్యక్తిమీద నిలిచి పోయాయి. అతనే 'బాస్' అని గ్రహించాడు.

"మిస్టర్ రవీ! ఇంతకు ముందే మాతో రాజీపడివుంటే శాంతిని, నీరజను చంపేవాళ్ళం కాదు" అని ఆ మాస్క్ తొడుక్కున్న వ్యక్తి జాలిగా అంటుంటే రవిలో రక్తమంతా సలసల కాగిపోయింది.

"నువ్వు మా దారికి రావటానికి ఆ ఇద్దర్నీ చంపాల్సి వచ్చింది. ఇప్పుడు పోలీసులు నీ కోసం నగరమంతటా గాలిస్తున్నారు. రేపటికి నీ ఫోటో పేపర్లోకి కూడా ఎక్కుతుంది. ఇప్పుడు మా రక్షణ నీకు చాలా అవసరం. ఏమంటావ్!"

రవికి అతని కంఠస్వరం వింటున్న కొద్దీ ఎక్కడో, ఎప్పుడో విన్నట్టుగా అనిపిస్తోంది. కాని సరిగా నిర్ధారణ చేసుకోలేకపోయాడు.

"నేను అందుకే మీతో చేయి కలపాలని వచ్చాను. ఇప్పుడు నేను పోలీసుల దృష్టిలో నాలుగు హత్యలు చేసిన హంతకుడిని. ఒకవేళ నేను దొరికితే నాకు మరణ శిక్ష తప్పదు. అందుకే మంచికి గుడ్ బై కొట్టి, చెడుకు వెల్ కమ్ పలికాను. చెప్పండి ఒకటా, రెండా, ఎన్ని హత్యలు చెయ్యాలో" రవి కేర్లెస్ గా అంటుంటే అంతా అతని ధైర్యానికి ఆశ్చర్యపడ్డారు.

అతను తన జేబులోంచి ఒక ఫోటో తీసి రవికి అందించి "ఈ వ్యక్తిని నువ్వు చంపాలి" అని అన్నాడు.

రవి ఆ ఫోటో చూసి వులిక్కిపడ్డాడు.

ఆ ఫోటోలో వ్యక్తి ఎవరో కాదు, రవి అన్న సూర్యం.

తన అన్నని చూడగానే అతనిలో అనురాగం పొంగి పొరలింది.

"అతన్ని ఎందుకు చంపాలి?" అని ప్రశ్నించాడు.

"రవీ! సూర్యం నాకన్ని విధాల వ్యతిరేకంగా పని జేస్తున్నాడు. మేం ఏదైనా దోపిడీ చెయ్యాలనుకొంటే. వాడు మా ప్లాను పడగొట్టి ఆ పని తను చేస్తున్నాడు మేము కూడా వాడి ప్లాన్స్ అలాగే పడగొడుతున్నాం అనుకో. కానీ ఇది ఇరుపార్టీల వారికి చాలా ఇబ్బంది. సూర్యం చస్తేకాని మేం ముందుకు పోలేం!"

"అంతా బాగానేవుంది. కానీ ఒక్క మనిషిని చంపటానికి ఇందరు వుండగా నేనే ఎందుకూ?"

"రవీ! మా ముఠాలో ప్రతీవ్యక్తిని ఆ సూర్యంగాడికి బాగా తెలుసు. అందుకే మేము వాడిని వంచించలేక పోతున్నాం. సూర్యం రోజూ సాయంత్రం ఆరుగంటలకు హోటల్ కార్తికేయకు వస్తుంటాడు. నువ్వు రేపు అతన్ని కల్సుకొని, అతనితో పరిచయం కల్గించుకొని, అతన్ని చంపాలి. ఈ పని తెలివిగా చేస్తే, నీకు మంచి బహుమతి లభిస్తుంది."

రవి తను అన్నింటికి సిద్ధమే అన్నట్లు తలవూపి, మాస్క్ తొడుకొన్న వ్యక్తితో కొంతసేపు మాట్లాడి బయటపడ్డాడు.

## 9

ఆ మర్నాడు సాయంత్రం రవి తన వేషాన్ని కొంచెం మార్చుకొని కార్తికేయలోని కెళ్ళాడు.

సర్వర్‌కి గులాబ్ జామ్ ఆర్డర్ చేసి, అందర్నీ ఓసారి చూసాడు. సూర్యం కనిపించలేదు అతనికి.

సర్వర్ గులాబ్ జామ్ పెట్టి వెళ్ళిపోయాక తింటూ అందర్నీ గమనించసాగాడు.

అతని చూపులు మాటి, మాటికి వీధిలోకి పరిగెడుతున్నాయి, సూర్యం రాకకోసం.

అంతలో ఒక వ్యక్తి హోటల్ లోకి ప్రవేశించాడు.

ఆ వ్యక్తి రవి ముందు కుర్చీలో కూర్చొని బాదంగీర్ ఆర్డర్ ఇచ్చాడు.

సర్వర్ అది తెచ్చిపెట్టి వెళ్ళిపోయాక "రవీ! నా పేరు జయరాజ్. నీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి" అని అన్నాడు.

"ఏం మాట్లాడాలి?" రవి ఆశ్చర్యంగా అడిగాడు.

"ముందు టిఫిన్ తిను. తర్వాత మాట్లాడుకొందాం" జయరాజ్ బాదంగీర్ తాగుతూ అన్నాడు.

రవి అతను ఏం చెప్తాడో అని తొందరగా తినేసి, చెయ్యి కడుక్కొన్నాడు.

అతను తినేసాక బిల్ చెల్లించి ఇద్దరూ హోటల్ బయటకి వచ్చారు.

జయరాజ్ హోటల్ ముందున్న టొయెటో కారు ఎక్కాడు.

రవి మౌనంగా అతని ప్రక్కనే కూర్చున్నాడు.

మరుక్షణం కారు సర్రున దూసుకుపోయింది.

"రవీ! నువ్వు నాగరాజారావుని చంపాలి!"

"ఎవరా నాగరాజారావు."

జయరాజ్ తన జేబులోంచి ఒక ఫోటో తీసి రవికి అందించాడు.

ఆ ఫోటో చూడగానే రవి అంతెత్తున త్రుళ్ళిపడ్డాడు. ఆ ఫోటో అతని తండ్రిది.

రవికి మతిపోతున్నట్లు అనిపించింది.

తన తండ్రీ, అన్న ఇద్దరూ దేశద్రోహులే. పైగా ఒకర్ని ఒకరు చంపుకోవాలని చూస్తున్నారు. ఆ ఇద్దరికీ తమ రక్తసంబంధం తెలుసా?

"జయరాజ్! నాగరాజారావు సూర్యానికి ఏమైనా అవుతాడా?"

"అవుతాడా అని చిన్నగా అడుగుతావేం! ఇద్దరూ తండ్రీ కొడుకులు. అయితే ఇద్దరూ తగవుపడి విడిపోయారు. నాగరాజారావు వుంటే మాకు చాలా ఇబ్బంది. నువ్వు సూర్యాన్ని చంపటానికి వినియోగించబడ్డావని మాకు తెలుసు. వాళ్ళ వేలితో వాళ్ళ కన్నే పొడవాలి. నీకు రివాల్వర్ ఇస్తాను. నాగరాజారావుని షూట్ చేసి రావాలి."

రవి ఎంతగానో ఆశ్చర్యపోయాడు.

తండ్రీ, కొడుకులని తెలిసినా ఇద్దరూ ఒకర్ని, ఒకరు చంపుకోవాలనుకొంటున్నారా?

రవి జయరాజ్ వైపు చూసి "ముందు నేను సూర్యాన్ని చూడాలి. అతని దగ్గరకు తీసుకువెళ్ళు" అని అన్నాడు.

అతను రెండు క్షణాలు ఆలోచించి కారుని సూర్యం ఇంటికి పోనిచ్చాడు.

సూర్యం ఇల్లు చాలా ఆధునికంగా కనిపించింది.

జయరాజ్ కారు దిగి దగ్గరగా వేసి వున్న తలుపుల్ని చూసి, ఖంగారుగా లోపలకి ప్రవేశించాడు.

రవికూడ అతనితో లోపలకి వెళ్ళాడు.

టేబిల్ మీద పేపర్ వైట్ క్రింద రెప, రెప లాడుతున్న కాయితం ఇద్దరి కళ్ళకు కనిపించింది.

జయరాజ్ దాన్ని అందుకొని పైకే చదివాడు.

"జయరాజ్! నీ బాస్ సూర్యం లక్కీగా మా చేతికి చిక్కిపోయాడు. రేపటికి నీ బాస్ శవాన్ని నీకు కానుకగా పంపిస్తాం!"

ఇట్లు,
—నాగరాజారావు".

"రవీ! కమాన్. మనం సూర్యాన్ని రక్షించాలి. నాగరాజారావు స్థావరం చూపించు" అతను కలవరంగా అన్నాడు.

"మిస్టర్ జయరాజ్! సూర్యాన్ని విడిపించాలంటే నాకు ఒక రివాల్వర్, ఒక టేప్‌రికార్డర్ కావాలి!" అన్నాడు రవి.

అతను ఎందుకూ? అని ప్రశ్నించకుండా ఆ రెండూ రవికి అందించాడు.

రవి రివాల్వర్ అందుకొని రెప్పపాటులో అది వెనక్కి త్రిప్పి జయరాజ్ తలపై బలంగా కొట్టాడు.

అతను చిన్నగా మూలిగి క్రిందపడ్డాడు.

రవి టెలిఫోన్ దగ్గరకు నడచి పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేసాడు.

నాగరాజారావు స్థావరానికి రమ్మని ఇన్‌స్పెక్టర్‌కు ఆ ఎడ్రస్ చెప్పి, బయటకి నడచి తలుపులు మూసేసి, కారు ఎక్కాడు.

అతను నీరజ దగ్గర డ్రైవింగ్ నేర్చుకొన్నాడు.

కారును నాగరాజారావు బంగళావైపుకు పోనిచ్చాడు.

గూర్ఖా రవిని ఎరిగివుండటంతో మర్యాదగా సలాం చేసి గేటు తెరిచాడు.

రవి కారుని లోపలకి పోనిచ్చి, ఒక వారగా ఆపి, జేబులో వున్న టేప్ రికార్డర్ ఆన్ చేసి, రివాల్వర్‌తో లోపలికి నడిచాడు.

# 10

సూర్యాన్ని నలుగురు పెడరెక్కలు విరచి గట్టిగా పట్టుకొన్నారు.

నాగరాజారావు రివాల్వర్ అతని గుండెలకు గురిపెట్టి నిలుచున్నాడు.

"నాన్నా!" రవి గట్టిగా అరచినట్లు పిలిచాడు.

నాగరాజారావు ముఖానికున్న మాస్క్ తీసి, రవిని వింతగా చూసాడు.

"నాన్నా! సూర్యం నీ కొడుకు. నేను మీ రెండవ కొడుకు రవిని" రవి గాబరా నటిస్తూ అన్నాడు.

నాగరాజారావు పెళ్ళున నవ్వాడు. "రవీ! మా ఇద్దరికీ మా సంబంధం తెలుసు. సూర్యం చిన్ననాటినుంచి నాకు వ్యతిరేకంగా పెరిగాడు. మీ అమ్మా, ఆ విశ్వనాథం, నన్ను వంచించి అక్రమ సంబంధం పెట్టుకొన్నారు. విశ్వనాథంగాడు నా అనుచరుడిగా వుంటూ నన్ను మోసగించాడు. అందుకే ముందు మీ అమ్మని చంపేసాను. ఆ తరువాత విశ్వనాథాన్ని చంపేసాను. ఆ రెండు హత్యలు నీ మీద పడ్డాయి. నువ్వు జైల్లో వుండటమే వుత్తమం అనుకొన్నాను. ఎందుకంటే నీకు చాలా మంచి గుణాలు వున్నాయి. నువ్వు మాతో వుంటే మా పనులకు ఆటంకం.

ఇప్పుడు మీ ఇద్దరూ నా చేతికి చిక్కారు మీ ఇద్దరూ

బ్రతికి వుండకూడదు. నీకు శాంతి, నీరజలను చంపింది మేమే అని తెలుసు, అంతేకాదు, నా రూపాన్ని కూడా చూసేసావు. అందువల్ల నువ్వు కూడా..."

నాగరాజారావు రివాల్వర్ రవి వైపుకు త్రిప్పబోతుండగా రవి చటుక్కున రివాల్వర్ తీసి అతని గుండెలకి గురిపెట్టాడు.

"మర్యాదగా అంతా గన్స్ క్రింద పడెయ్యండి" రవి గర్జిస్తున్నట్లు అన్నాడు.

అంతా గప్ చిప్ గా గన్స్ క్రింద పడేసారు.

సూర్యం, రవి వైపు ఆశగా చూస్తూ—

"రవీ! ముందు నాన్నని చంపెయ్" అని అన్నాడు.

"మైడియర్ బ్రదర్. నేను మీలా హంతకుడిని కాను. న్యాయంకోసం ప్రాకులాడే మనిషిని. మీరు మీరు చంపుకొని ఆ నేరం నా మీదికి నెట్టాలని చూశారు. ఇంకొక్క రెండు క్షణాలలో పోలీసులు వస్తారు..." అతను ఇంకా ఏదో అనబోతుండగా ఇనస్పెక్టర్, పోలీసులు లోపలికి ప్రవేశించారు.

"ఇనస్పెక్టర్! పదేళ్ళు నేను చేయని నేరాలకి శిక్ష అనుభవించాను. ఆ రెండు హత్యలూ చేసింది నాగరాజా రావు. ఆ విషయాలన్నీ టేప్ రికార్డర్‌లో వున్నాయి" రవి టేప్ రికార్డర్ జేబులోంచి తీసి, ఇనస్పెక్టర్‌కు అందించాడు.

నాగరాజారావుకు, సూర్యానికి అందరికీ బేడీలు పడ్డాయి.

రవి, జయరాజ్ గురించి కూడా చెప్పాడు.

* * *

నాగరాజారావుకు మరణ శిక్ష పడింది.

సూర్యానికి యావజ్జీవ కారాగార శిక్ష విధించబడింది.

రవి నిర్దోషి అన్న సంగతి పేపర్లు ప్రకటించాయి. ఎందరో అతని నిజాయితీని అభినందించారు.

ఇనస్పెక్టర్ రవి చేతిని తన చేతిలోకి తీసుకొని "రవీ! నీలాంటి నిజాయితీపరుడువల్ల దేశానికి పట్టిన చీడపురుగుల్ని ఏరి పారెయ్యవచ్చు" అని అన్నాడు.

"ఇనస్పెక్టర్! నా నిజాయితీకోసం నా ప్రేయసిని, అమాయకురాలైన శాంతిని వదులుకొన్నాను. తండ్రినీ, అన్ననూ, పోలీస్‌లకు పట్టి ఇచ్చాను. నేను ఈ లోకానికి మిగిలి వుండవచ్చు కానీ, లోకంలో నాకేం మిగల్లేదు" రవి బాధగా అన్నాడు.

"రవీ! బాధపడకు నువ్వు నా ఇంట్లోనే వుందుగాని. నిన్ను చదివించి, నాలాగే ఇనస్పెక్టర్‌ని చేస్తాను. నువ్వు మణి లాంటి వాడివి. నీలాంటి సాహస యువకుడు మన మాతృదేశానికి వెన్నుపూస వంటివాడు..."

ఆయన మాటలు పూర్తి కాకుండానే, రవి ఆయన కాళ్ళకు నమస్కరించాడు.

—: ఐపోయింది :—

# నకిలీ ఫ్రేంకీ!

కంచర్ల రమణ

నైట్ క్లబ్బుల్లోనూ, డిస్కో తెక్స్‌లోనూ మాత్రం అలికిడి, హడావుడివున్న సమయం అది. అంటే, రాత్రి ఒంటిగంట తర్వాత. గోవా అంతా మెత్తని సిల్కు రాత్రి కౌగిలిలో ఆదమరిచి నిద్రపోతూంది.

అది మాపూసా పోయే హైవే. గోవా రాజధానీ నగరం పాంజిమ్‌కు పది మైళ్ళ దూరంలోని అడివిప్రాంతం.

చిక్కని కాటుకలాంటి చీకటి. రోడ్డుకు ఓవైపున కొండ ఆకాశంలోకి నిటారుగా లేస్తే, రెండోవైపు లోయ గాలివేసే ఈలతప్ప అంతటా నిశ్శబ్దం.

రోడ్డుకు వారగా ఓ నల్లని జావామీద, అదే రంగు రెయిన్‌కోటు, టోపీ ధరించిన ఓ వ్యక్తి కూర్చున్నాడు.

అతడి చూపులు, పాంజిమ్ నుంచి వచ్చే రోడ్డు దిశగా చీకటిని చీల్చి చూస్తున్నాయి.

అతడి ఓపిక, ఓర్మి అమోఘం. సుమారు గంటనుంచీ, అలాగే అక్కడి చలనరహిత ప్రకృతిలో ఓ భాగం అయిపోయి, ఎందుకో, ఎవరికోసమో ఎదురు చూస్తున్నాడు.

హఠాత్తుగా "ఉష్" మంటూ శబ్దం వినిపించడం మొదలుపెట్టింది. వర్షంకూడా మొదలవుతోందన్న మాట" అనుకున్నాడు అతను.

గోవాలో వర్షం అక్షరాలా నడిచివస్తుంది. అది గోవా ప్రత్యేకత.

టపటపామంటూ అతడిమీద జల్లు కురవటం మొదలవగానే 'వాతావరణం దుర్భరం అయిపోతోంది' అనుకుని, తన కోటుకాలర్ని, మెడకు దగ్గరగా చేత్తో అదుముకున్నాడు.

ఇంకో రెండు నిముషాలు గడిచేసరికి, ఆకాశం బొక్క పడినట్టుగా కురవడం మొదలుపెట్టింది.

ఆ కుంభవృష్టిలో యింకో పావుగంట గడిచేసరికి, హఠాత్తుగా చీకటి చిట్లి, రెండు కాంతిరేఖలు జిగ్ మంటూ కనిపించాయి. ఆ తర్వాత సన్నగా మోటారు రొద.

తన మోటారుసైకిలు దిగివచ్చాడు ఆ వ్యక్తి. రోడ్డుకు మధ్యగా నిలుచున్నాడు. కాంతిరేఖలకు కారణమైన వస్తువు దగ్గరయింది. అదొక బ్లాక్ మెర్సిడెస్ కారు. దాని నెంబరు ప్లేటు జి. డి. టి. 4681 ముందర లైటుకాంతిలో చక్కగా అవుపిస్తోంది.

అతనికి కావల్సిన కారు అదే!

రోడ్డుకు మధ్యగా నిల్చిన ఆ వ్యక్తి చేతులు పైకీ కిందికీ ఊపుతూ కారును ఆపమన్నట్టుగా సైగ చేసాడు.

కారు ఆగింది అయిష్టంగా.

ఆ కారులో డ్రైవరూ, ఓనరూ సర్వమూ-ఒకేఒక వ్యక్తి వున్నాడు.

"ఏమిటి సంగతి?" అడిగాడు కారులో వ్యక్తి చిరాకుగా, వర్షం జల్లు కొట్టకుండా యెత్తిన గాజు అద్దాన్ని దించి.

"నా మోటరుసైకిలు చెడింది యీ దిక్కుమాలిన స్థలంలో. లిఫ్టు కావాలి...ప్లీజ్!" అన్నాడు కారు ఆపిన వ్యక్తి కారుకు కుడివైపుగా వచ్చి. అప్పుడు చూసాడు ఆ వ్యక్తిని స్పష్టంగా కారులో వ్యక్తి. అతడు అచ్చం తనలాగే వుండడం చూసి చకితుడయ్యాడు, ఓ క్షణం.

తేరుకుని "ఓకే! యెక్కండి త్వరగా" అన్నాడు కారు వ్యక్తి.

"థేంక్స్!" అని అన్నాడు ఆ వ్యక్తి. కాని, కారు వెనకడోరు తెరుచుకుని లోనికివచ్చి కూచోడానికి ప్రయత్నించలేదు. జేబులోంచి పిస్టలు తీసి, కారువ్యక్తిమీద గురిపెట్టి రెండుసార్లు కాల్చాడు.

"ఆ!" ఆశ్చర్యంతో తెరుచుకున్న నోటిద్వారా కారు వ్యక్తి ప్రాణాలుపోయాయి.

ఆ తరువాత యాంత్రికంగా, పద్ధతిగా తన పనులు కానిచ్చుకున్నాడు ఆ వ్యక్తి.

తన మోటారుసైకిలుతోపాటుగ, కారువ్యక్తిని, లోయలోకి గిరవాటేసాడు.

వెనక్కి వచ్చి, కారుని డ్రైవ్ చెయ్యా నారంభించాడు.

'ఇప్పుడు నేను ఫ్రాంకీ పెరైరాని' అనుకున్నాడు ఆ వ్యక్తి, కారుని మాపుసావైపు దూకిస్తూ.

## 2

ఫ్రాంకీ పెరైరా కస్టమ్స్ డిపార్టుమెంటులో ఆఫీసరు. బ్రహ్మచారి. వయస్సు ముప్ఫైరెండు. వాస్కోడగామాలో వుంటాడు. అతనికి బంధువులంటూ ఎవరూ లేరు - ఒక్క మపూసాలోని అతని చిన్నాన్న, అతని యిద్దరు పిల్లలు తప్ప.

ప్రతీ వారాంతానికీ, మధ్యాహ్నం మూడింటికి తన మెర్సిడిస్‌లో వాస్కోనుంచి బయలుదేరుతాడు ఫ్రాంకీ. పాంజిమ్‌లో ఓ డిస్కోతెక్‌లో-పేరు స్క్వేజ్ ఇన్-రాత్రి పన్నెండు వరకూ త్రాగి, డాన్సుచేసి కాలం గడుపుతాడు. ఆ తరువాత మాపూసాలో వున్న తన చిన్నాన్న యింటికి బయలుదేరి వస్తాడు. మర్నాడు ఆదివారం అంతా చిన్నాన్న యింట్లో గడిపి, సోమవారం వుదయం ఆరింటికల్లా బయలుదేరి, తిరిగి మూడు గంటల్లో వాస్కో చేరుకుంటాడు.

అయిదడుగుల ఆరంగుళాల యెత్తు, నూటముప్ఫై పౌనుల బరువు. సన్నగా, చామనఛాయగావున్న ఫ్రాంకీకి స్నేహితులు మహా కొద్దిమంది. వాళ్ళు కూడా ఫ్రాంకీతో బాగా సన్నిహితంగా వుండరు. వారితో పరిచయం, స్నేహం, హాలో అంటే హాలో అంతవరకే.

అందమైన అమ్మాయిలంటే, ఫ్రాంకీకి కోరిక లేక పోలేదుకాని, వాళ్ళు తనని పెళ్ళి వుచ్చులో బిగిచేస్తా

రేమోనని తగనిభయం. అందుకే, తనతో తాత్కాలిక సంబంధం కోరుకున్న వాళ్ళనే, తనలాగే రిజర్వుడ్ గా వుండే అమ్మాయిల్నే చేరువకు రానిస్తాడు. ఆ తరువాత కూడా, కొద్ది కలయికల తర్వాత, వాళ్ళని నేర్పుగా, చల్లగా వదిలించుకుంటాడు.

ఈ వివరాలతో పాటుగా, ఫ్రాంకీ అలవాట్లు, తిరిగే ప్రదేశాలు, ఉండే పరిసరాలు, మాట్లాడే పద్ధతులు వగైరా సవాలక్ష విశేషాలు సేకరించింది, ఫ్రాంకీ స్థానంలో యింకో వ్యక్తిని ప్రవేశపెట్టేముందు, పాకిస్తాన్ ఇంటెలిజెంస్ డిపార్టుమెంటైన ట్రిబుల్ ఆర్. ట్రిబుల్ ఆర్ అంటే, రీసెర్చి, రీచ్ అండ్ రైటాఫ్.

ఫ్రాంకీ రూపంలో, ఫ్రాంకీ కారులో మఫూసా వెళుతున్న నకిలీ ఫ్రాంకీ ట్రిబుల్ ఆర్ తనకు ఒంట బట్టించిన ఫ్రాంకీ తత్వాన్ని మననం చేసుకోసాగాడు.

ఫ్రాంకీ చిన్నాన్న పేరు జోనీ. జోనీ పెద్దకొడుక్కి మాంసం సామాసాలంటే మహాయిష్టం. చిన్నకొడుక్కి మిల్క్ చాక్‌లెట్స్ అంటే చాలాప్రీతి.

తను కూచున్న సీట్లో, రెండు పొట్లాల్లో అవివుండడం చూసి నవ్వుకున్నాడు నకిలీ ఫ్రాంకీ. జోనీకి ఫారిన్ లిక్కర్స్ అంటే మోజు. అవి కూడా వున్నాయి రెండు బాటిల్స్ అతనితో.

# 3

స్నానం కానిచ్చి, డ్రాయింగ్ రూంలో ఫ్రాంకీ అడుగు పెట్టేసరికి, అక్కడో అమ్మాయి నడుంమీద చేతులు ఆనించుకుని, బోరవిడిచి, చిరునవ్వు నవ్వుతూ నిలుచుంది.

స్థానువయ్యాడు ఫ్రాంకీ.

ఎవరీ అమ్మాయి? ఫ్రాంకీకి యేమవుతుంది? ఈఅమ్మాయి గురించి ట్రిబుల్ ఆర్ తనకి బ్రీఫ్ చెయ్యలేదే? ఎలాగ? కంగారుగా వుందతడికి.

"హలో!" అందామె, యింకా పెదాలమీద మాయని చిరునవ్వుతో.

"హలో!" అంటూ బదులిచ్చాడే గాని, ఆమెను ఎలా ట్రీట్ చెయ్యాలో అర్థం కావడంలేదతనికి.

ఇలాంటి పరిస్థితులు ఓ రోజున యెదురవ్వొచ్చని ఊహించలేకపోలేదు గాని, యింత తొందరగా ఎదురవుతాయని తాను కలలో గూడా అనుకోలేదు.

అయితే, ఎక్కడ, ఎవరుచేసారు పొరపాటు? నిశితంగా ఆలోచించిన మీదట పొరపాటు ట్రిబుల్ ఆర్ దే అని గ్రహించాడు. ట్రిబుల్ ఆర్ ఈ అమ్మాయి గురించి ఫోటోగ్రాఫ్ సేకరించి తనకు అందివ్వలేదు.

అయినా, యిప్పుడు వాళ్ళని తిట్టుకుంటూ కూచుంటే పని జరగదు అనుకుని "సిడౌన్! మేక్ యువర్ సెల్ఫ్ కంఫర్టబుల్" అన్నాడు.

"అమ్మయ్యా!...నీ రెస్పాన్స్ ఎలాగుంటుందో అని హడలి చచ్చిపోయేను ... గత వారంరోజులుగా...నీ పరిచయం గురించి ప్రయత్నిస్తే యిప్పుడు కుదిరింది" అందా అమ్మాయి, సోఫాలో కూలబడి గట్టిగా నిట్టూర్చి.

అదే అదనుగా "ఒక్క నిముషం...డ్రెస్ చేసుకుని వస్తాను" అని బెడ్ రూంలోకి జారుకున్నాడు ఫ్రాంకీ.

"అమ్మయ్య" అంటూ ఫ్రాంకీ కూడా నిట్టూర్చాడు, తన బెడ్ రూంలోకి వెళ్ళి.

కొత్త పరిచయమున్న మాట! పాత స్నేహం కాబోలు అనుకుని ఆమెతో ఎలా మెలగాలో అనుకుని తెగమథన పడిపోయాడు.

అతడి డ్రెస్సింగ్ పూర్తయింది. డ్రాయింగ్ రూంలోకి తిరిగి వచ్చాడు.

"వెల్!...నీ పేరేమిటి?" అన్నాడు ఆమె కెదురుగా వచ్చి కూచుని.

"క్లారా!" కళ్ళల్లో మెరుపులతో చెప్పిందామె.

"నాకు చాలా యిష్టమైన పేరు" ఓ ఫీలర్ వదిలి చూసాడు ఫ్రేంకీ.

"అంటే, నేను యిష్టం లేనట్టా?" అందామె అలుగు నటిస్తూ.

"నో! నో! ఆ మాటెవరన్నాడు... నువ్వు యిష్టమే మిల్క్ టాఫీలాగ" ఆమె వైపు కొరిగ్గా చూస్తూ అన్నాడు.

అప్పుడు చూసాడు ఆమె రూపురేఖల్ని నిశితంగా ఆమె సన్నగా వుండడంవల్ల, పొడుగ్గావున్న భావన కలిగిస్తోంది కాని, మదిమట్టంగా సుమారు యెత్తులోవుంది. కోలమొహం, సూదిముక్కు, విడల్పాగా వున్నా, తీర్చి దిద్దినట్టున్నాయి పెదాలు. పెద్దకళ్ళు ఆమె తెలివి తేటల్ని గాకుండా, ఆమె హృదయపు లోతుల్నికూడా తెలియజేస్తున్నట్టుగా వున్నాయి.

ఒక పరిపూర్ణ స్త్రీరూపం అతడి మనస్సుమీద చెక్కబడింది.

"థేంక్యూ!" అని అనేసి, ఓరగా చూస్తూ "మరి యిన్నాళ్ళూ, నేను వచ్చి పరిచయం చేసుకునేదాకా

పట్టించుకోలేదేం?" అంది క్లారా.

"ఏదీ ఆ అవకాశం యెప్పుడూ కలగలేదే!"

"అబద్ధం!"

"ఒట్టు" సీరియస్‌గా ముహం పెట్టాడు.

"సరే, ఒప్పుకున్నాను ... మరి యిప్పటినుంచైనా నాతో స్నేహంగా ఉంటావా?"

"ఉంటావా? అని అడుగుతున్నావా ... ఉండనని నీవన్నా నేనూరుకోను. నేను మాత్రం ఉంటాను" నవ్వి అన్నాడు.

క్లారా యేదో స్మగ్లింగ్ వాళ్ళ అమ్మాయి అయి వుంటుంది. కస్టమ్స్ వాళ్ళ సానుభూతి సహకారాలు కావాలి కాబట్టి యిలా ఓపెన్‌గా వచ్చి, తనకి ఆఫర్ చేసుకుంటోంది అనుకున్నాడు ఫ్రేంకీ.

తనకు కొత్తేమోగాని, కస్టమ్స్ వాళ్ళకి యిలాంటివి కొత్తవి కావేమో, ఆడవాళ్ళని ఎరజూపడం, డబ్బులు కట్టలుగా ఆఫర్ చెయ్యడం కస్టమ్స్ వాళ్ళకు నిత్య అనుభవమేమో, అలాంటి ఆకర్షణలంటే, ఫ్రేంకీ అనాసక్తత పెంచుకుని వుంటాడు, కాని తను?

తన లక్ష్యం సాధించుకోవడానికి, వాళ్ళు పనికొస్తే వాళ్ళని వినియోగించుకోవాలి.

"ఓకే! దెన్ ... రేపు అంజునా బీచీకి వెళుతున్నాం... నువ్వూ రాకూడదూ?" అంది క్లారా లేచి.

"వెళుతున్నాం అంటున్నాం. ఎవరెవరు?" అడిగాడు ఫ్రేంకీ.

"నేనూ నా ఫ్రెండ్ లైనా" చెప్పింది క్లారా.

"రేపు నాకు ఆఫీసు ఉందే..." అభ్యంతరం వెలిబుచ్చాడు ఫ్రేంకీ.

"ఓ రోజు సెలవు పారేయకూడదూ?" సలహా యిచ్చింది క్లారా.

"అలాగే...వస్తాను" అన్నాడు ఫ్రేంకీ తన చెయ్యి ముందుకు చాపి.

అతడి చెయ్యి అందుకుని షేక్ హాండ్ చేసి "థేంక్స్" చెప్పి వెళ్ళిపోయింది.

ఫ్రేంకీ ఆలోచనల్లో పడ్డాడు.

# 4

నకిలీ ఫ్రేంకీని ఓ కమర్షియల్ షిప్ లో డెక్ హేండ్ గా చేర్పించి, ఇండియాలో దిగవిడిచేముందు ఓ ఫోను నెంబరు యిచ్చింది ట్రిబుల్ ఆర్. ఆ నెంబర్ని కంఠస్థం చేసాడు ఫ్రేంకీ; తన కివ్వబడిన అనేకానేక వివరాలతో పాటుగ.

"మిస్టర్ జెడ్...నీకు ఏదైనా భోగట్టా కావాలంటే యీ నెంబరు డయల్ చెయ్యి, ఎటువంటి పరిస్థితుల్లోనూ ఆ వ్యక్తి యెవరూ, యేమిటన్న విషయాలు తెలుసుకోవ డానికి ప్రయత్నించకు. ఎక్కడ యేమాత్రం తప్పు దొర్లినా, ఆ వ్యక్తిరక్తం తాగుతుంది భారత్ ప్రభుత్వం" అని చెప్పి ఓ కోడ్ కూడా యిచ్చింది ట్రిబుల్ ఆర్.

ఫ్రేంకీకి క్లారాగురించి తెలుసుకోవాలని అనిపించగానే ట్రిబుల్ ఆర్ తనకు యిచ్చిన సూచనలు గుర్తొచ్చాయి.

ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్ కు వెళ్ళి, నెంబరు డయల్ చేసాడు. అవతల రింగయి ఫోనెత్తగానే, "నేను మాట్లాడుతున్నది టిమ్ తో నేనా?" అన్నాడు.

"నో. మీరు టుమ్ తో మాట్లాడుతున్నారు" అన్న జవాబు వచ్చింది మరుక్షణంలో.

టిమ్-టుమ్ అన్నది కోడ్ వర్డ్స్.

"టుమ్! నాకు కాస్త భోగట్టా కావాలి"

"చెప్పండి...ఎట్ యువర్ సర్వీస్"

"క్లారా యెవరు?"

"యే క్లారా?"

"క్లారా ఫెర్నాండీస్."

రెండు క్షణాలు అవతల నిశ్శబ్దం. మళ్ళా ఫ్రేంకీ అన్నాడు.

"నాకు వెంటనే చెప్పక్కర్లేదు...కావలిస్తే టైం తీసుకో."

"ఇట్సాల్ రైట్!...అవుసరం లేదు...షి యీజ్ ఎ లవ్లీ బిచ్...ఎంజాయ్ హెర్!"

"యూ మీన్ ఫుల్లీ క్లీన్?"

"క్లీన్ యాజ్ ఎ టీ స్పూన్" జవాబు వచ్చింది అవతలినుండి.

## 5

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలు కావస్తుండగా, క్లారా వచ్చింది, స్నేహితురాలు టైనాని వెంటబెట్టుకుని.

"మీట్ మై బూసమ్ ఫ్రెండ్ టైనా" అంటూ ఎంతో హుషారుగా టైనాను పరిచయం చేసింది క్లారా. ఫ్రేంకీ రెండు క్షణాలు ఖర్చుచేసాడు, చూపులతో టైనాని అంచనా వేస్తూ.

క్లారా నాజూగ్గా, హుందాగా ఉంటే, టైనా మొరటుగా, దృఢంగా, ఠీవిగా గుండ్రని అంగాలతో నిండుగా ఉంది, పైగా వాచాలత్వం.

ఆమెకు కొత్తా పాతా అన్నది లేదు. ఫ్రేంకీ పరిచయం అయిన మరుక్షణం నుంచీ బూతు జోక్స్ వెయ్యడం ఆరంభించింది.

"మీకు అంకెలు రావని పందెం" అంది రైనా.

"ఎలా?" అన్నాడు ఫ్రేంకీ నివ్వెరపోతూ.

"నిరూపిస్తాను. పందెం యెంత?"

"మీరు కోరినంత"

"69 అంటే యేమిటి?

ఒక్క క్షణం ఫ్రేంకీ మెదడు చీకటయిపోయినట్టయింది. కాని వెంటనే క్లియరైంది. 69 ఒక చిత్రమైన రతిబంధం.

"హా! వాటే డర్టీ మైండ్ యూ హేవ్?" అన్నాడు విరగబడి నవ్వేసి.

"ఫరవాలేదు... మీకు అంకెలు వచ్చు" అంది తానూ నవ్వుతూ.

"ఛ! ఛ! యేమిటా మాటలు మగాళ్ళతో బండగా" గదమాయించింది క్లారా, మధ్యలో కల్పించుకుని.

"అంటే నీలాంటి ఆడవాళ్ళతో బండగా ఉండొచ్చన్నమాట" అని అనేసి చటుక్కున క్లారా మొహం రెండు చేతుల్లోకి తీసుకుని, ఆమె పెదాల్ని గట్టిగా కొరికి ముద్దాడింది.

ఈ లెస్బియన్ ప్రవర్తన చూసి ఫ్రేంకీ నివ్వెరపోయాడు.

ఫ్రేంకీ కారులో మొదట ముగ్గురూ కలాంగూట్ బీచీ చేరుకునేసరికి మధ్యాహ్నం పదకొండున్నరయింది.

గోవా ప్రత్యేకాకర్షణ కలాంగూట్ బీచ్. సుమారు రెండు మూడు ఫర్లాంగులవరకూ కావాల్సిన లోతు కలిగి శక్తివంతమైన అంతర్ప్రవాహాలు లేకుండా ఉండి, యీతగాళ్ళకు బంగారు స్వప్నం అని ప్రపంచం అంతటా పేరు.

అందుకే, ఇండియాలో యే బీచిలోనూ కన్పించనంత మంది, విదేశీ యాత్రికులు యీ బీచిలో అవుపిస్తారు.

బీచిలో ఎక్కడ నిలబడి యెటు చూసినా, కనుచూపు మేర వరకూ తిన్నని గీతలా అవుపిస్తుంది. సంవత్సరంలో యే సీజనులో వెళ్ళినా–యీ బీచి నిండుగా పిక్నికర్స్‌తో కళకళలాడుతూ ఉంటుంది.

తీరం పొడవునా నీడకోసం, ప్రైవసీకోసం, మడకర్ర చెట్ల తోటలున్నాయి.

మిట్టమధ్యాహ్నం. ఆ తోటల్లో కూచుని, ముదురు నీలంగా మారి మెరిసే సముద్రాన్ని చూస్తూ గడపడం ఓ అపూర్వ అనుభవం.

అలాగే, లోకం లక్ష్యం లేకుండా, ఒంటిమీద ఒక్క నూలుపోగు మిగల్చకుండా కాసేపు నీళ్ళల్లో యీతకొట్టి వస్తూ, మరి కాసేపు ఎండలో ఒంటిని ఆరబెట్టుకుంటూ కాలం గడిపే స్వదేశీ విదేశీ యువతులని గమనించడం ఒక వింత.

కలాంగూట్ బీచికి ఎగువ చివరిభాగం 'భాగా బీచ్' తీరం వెంట దిలాసాగా నడుచుకుంటూ భాగా బీచ్ చేరుకోవచ్చు.

భాగా బీచ్ తరువాతిదే అంజూనా బీచ్. అయితే, తీరం వెంట చేరుకోవడం కుదరదు. కాలాంగూట్, భాగా బీచ్‌ల్ని, అంజూనా బీచ్ నుంచి వేరుచేస్తూ, చిన్న యేరు ఉంది. ఏటి కివతల యించుమించు సముద్రాన్ని చొచ్చుకుని వుండి, నిటారుగా లేచిన చిన్న మిట్ట ఉంది.

అయితే, అంజూనా బీచ్ ఎప్పుడూ నిర్మానుష్యంగానే ఉంటుంది.

"యేమన్నా తినిపోదామా?" అంది క్లారా కలాం గూట్ బీచ్ కి రాగానే.

"మనతోపాటుగా యిన్ని తెచ్చుకున్నాం. పైగా నువ్వూ, ఫ్రాంకీ ఉన్నారు, ఎవరికి ఎలాంటి ఆకలయినా తీర్చడానికి" అంది లైనా.

ప్రతీసారీ పచ్చి పచ్చిగా మాట్లాడే లైనా మాట, ఫ్రాంకీని జుగుప్సతో నింపుతోందిగాని యీసారి, అతడి కోరికని రెచ్చగొట్టింది.

ఫ్రాంకీ కసిగా లైనా పెదాలవైపు, బలిష్ఠమైన ఆమె మెడవైపు, ఆ మీదట స్వెట్టర్ తో అణగారి వున్న కుచ కండరాలవైపు ఒక్కక్షణం చూసాడు.

"అలా చూడకు. యు ఆర్ నాట్ మై వైఫ్" చటన్న ఆనేసి మొహం యింకో వైపుకు త్రిప్పుకుంది లైనా.

వేడి పెనంమీద నీళ్ళు దిమ్మరించినట్టుగా అయి పోయేడు ఫ్రాంకీ.

కారుని తిన్నగా అంజునా బీచ్ కి పోనిచ్చాడు ఫ్రాంకీ.

అంజునా బీచ్ నిర్మానుష్యంగా ఉండడానికి కారణం అందమైనదీ, అన్ని సౌకర్యాలు కల కాలాంగూట్ దగ్గరో ఉండడం. కాలాంగూట్ బీచ్ కే అందరూ వస్తున్నారు కాబట్టి, అంటరూ అక్కడే హోటల్సూ, మోటెల్సూ, రెస్టారెంట్లూ, బార్లూ తెరిచి, అంజునా బీచ్ ని ఎవరూ పట్టించుకోలేదు.

కారుని తిన్నగా తీసుకెళ్ళి, రెండు మిట్టల మధ్య ఖాళీ స్థలంలో, రోడ్డుకు దూరంగా ఆపాడు ఫ్రాంకీ.

మిగిన అరగంటలో, ఆరడుగుల పొడవు, మూడడుగుల వెడల్పూ గల ఓ పోలిథిన్ టెంట్ వేసారు, లైనా, క్లారా కలిసి.

టెంట్ కు వెలుపల, సిల్కు దారాలు కట్టిన సన్నని తుంగతో నేసిన చాపలు పరిచి, వాటిపైన బాటిల్స్, తిను బండారాల బాస్కెట్స్ సర్దారు.

"మళ్ళా టెంట్ దేనికి?" అన్నాడు ఫ్రేంక్, ఆశ్చర్యం వెలిబుచ్చుతూ.

"అది రాత్రికి—యిద్దరు పెళ్ళాల మొగుడికి" నవ్వి అంది ఫైనా.

"ఛీ! ఛీ! నీతో ఏ విషయం గురించి మాట్లాడినా, దాన్ని బూతులోకి దించేస్తావు" అంది క్లారా.

"ఛీ ఛీ అనే యీ మనుషులు రాత్రికి ఎంత నిషాగా ఉంటారో చూడనా...అప్పుడు అడగనా?" అంది ఫైనా తన ఒంటిమీద బట్టల్ని, ఫ్రేంకీ ఎదురుగా ఉన్నాడన్నైనా జంకకుండా విప్పి, తీరుబడిగా, బేదింగ్ డ్రెస్ వేసుకుంటూ.

క్లారా అలా గాకుండా, టెంట్ లోపలికి పోయి బట్టలు మార్చుకుని వచ్చింది. ఫ్రేంకీకూడా, పేంటూ షర్టూ విప్పేసి, కట్ డ్రాయరు, బనీనుతో సిద్ధమయ్యాడు స్నానానికి.

ముగ్గురూ స్నానాలకు దిగారు.

ఫైనా వేసే బూతు జోక్లకు అంతులేదు.

వాళ్ళ జోకులు ఓ ప్రక్కనవచ్చి చెవిలో పడుతున్నా ఫ్రేంకీ మెదడులో ఓమూల వేరే ఆలోచనలు సాగుతున్నాయి.

గోవా తీరానికి ఓ జలాంతర్గామి రాగానే, తన పథకం అమలుజరపాలి. అంటే, తను తరుచుగా సముద్రంలోకి వెళ్ళి చూసి రావడానికి ఓ మోటారు బోటు

కావాలి. పగలు కస్టమ్స్‌వాళ్ళ బోటు తను ఉపయోగించగలడు కాబట్టి, రాత్రిపూటకే తనకు అది అవసరం.

అయితే, బోటునెలా సంపాయించడం?

సాయంత్రమైంది. సూర్యుడు ఎర్రగా, మరింత ఎర్రగా, పెద్దగా, ప్లాస్టిక్ బంతిలా మారిపోయి, సముద్రంలోకి మునిగిపోయాడు. అతడు వెళ్ళిపోయిన అరగంటవరకూ పశ్చిమాన్ని అరుణిమ నిలిచింది. ఆ తరువాత, తెరలు తెరలుగా దిగిన చీకటి, క్రమంగా దట్టమై, నల్లని పాషాణంలా అవుపించసాగింది.

కొవ్వొత్తులు వెలిగించి, ఆరిపోకుండా చిమ్నీలు పెట్టి టెంట్‌లో పెట్టారు బయట హరికెను లాంతరు కాంతి ఉపయోగపడుతోంది.

రాత్రి మూడు రౌండుల విస్కీ తరువాత, మసాలా మటన్ ఛాప్స్ భోజనం తరువాత, అసలు విషయం చల్లగా బయటపెట్టింది క్లారా.

టైనా పైకి బడబడలాడడమే గాని, క్లారా నాయకురాలు వాళ్ళ టీమ్‌కి అని తెలిసి ఆశ్చర్యపోయేడు ఫ్రేంకీ.

“ఇప్పుడు వ్యాపార విషయాలు చర్చిద్దాం” అంటూ ఆరంభించింది క్లారా. ఫ్రేంకీ నిశ్శబ్దంగా, శ్రద్ధగా వినసాగాడు. టైనా అమితాశ్చర్యంగా ఒక్క కామెంట్ చెయ్యలేదు, క్లారా చెప్పడం ముగిసేవరకూ.

“బ్లూ ఫిల్మ్స్ ప్రొడ్యూస్ చెయ్యడం అమ్మడం నా వ్యాపారం. టైనా నా ఎసోసియేట్. మాకో అందమైన మగాడు కావాలి. అందుకు నిన్ను సెలక్ట్ చేసాం. పది నిముషాల వ్యవధి ఉన్న షాట్స్ తీస్తాం. ఫిల్మ్‌కు పాతిక వేలు యిస్తాను. ఎక్కడో యిరుకైన గదుల్లో స్త్రీ పురు

షులు భయం భయంగా కలుసుకునే ఫిల్ములు యిప్పుడు ఎవరికీ అక్కర్లేదు. సెక్స్ వుందన్న మాటేగాని. అందులో ఆర్ట్ కూడా ఉండాలి. ఓ నెగిటివ్ యిస్తే, లక్ష రూపాయలు యిస్తాడు డీలరు..యిదీ సంగతి..నువ్వేమంటావ్?''
అంది క్లారా.

ఫ్రాంక్ వెంటనే జవాబివ్వలేకపోయాడు. ఆలోచించసాగాడు.

తను యెక్కడ మునిగి యెక్కడ తేలాడు? ఇండియన్ సబ్ మెరైన్‌ని బ్లాస్ట్ చెయ్యడానికొచ్చి, బ్లూ ఫిల్మ్ ప్రొడక్షన్‌లో దిగాడేమిటి?

ఈ ఫిల్మ్‌లో పాల్గొంటే, తనకేమైనా ప్రమాదం ఉందా? ఉంటే అది యెటువంటిది? ఇందుకు ఒప్పుకుంటే ట్రిబుల్ ఆర్ ఆగ్రహిస్తుందా?

వీళ్ళు బ్లూ ఫిల్మ్ బిజినెస్‌లో ఉన్నారు కాబట్టి, వీళ్ళకి లోకల్‌గా చాలా పలుకుబడి ఉండి ఉంటుంది. తను వీళ్ళతో కోపరేట్ చేస్తే, ఆ పలుకుబడిని తన పథకాన్ని అమలుజరిపేందుకు వినియోగించుకోవచ్చు.

గొంతు సవరించుకుంటూ ''మీ రెవరో పెద్ద కుటుంబాలకు చెందిన డీసెంట్ గర్ల్స్ అనుకున్నాను...మీరు బ్లూ ఫిల్మ్ ప్రొడక్షన్స్ వాళ్ళని చిన్న అనుమానంకూడా కలగలేదు'' అన్నాడు.

''అది అంతే! ఈ రోజుల్లో ఎవరెవరో చెప్పడం కష్టం. ఇంతకూ నీ అభిప్రాయం వెంటనే చెప్పక్కర్లేదు.. తెల్లారేవరకు టైముంది...నీ యిష్టం'' అంది క్లారా.

''ఫ్రేంకీకి మన వ్యవహారం సుతరామూ యిష్టం లేనట్టుంది'' చాలాసేపటి తర్వాత మాట్లాడింది హైనా.

ఆమెవైపు చూసాడు ఫ్రీంకీ. స్కిన్ టైట్ రౌండ్ నెక్ స్లీవ్ లెస్ బనియన్ వేసుకుంది. దాన్ని మినీ స్కర్ట్ లో టక్ చేసింది. యింకేమీ వేసుకోలేదేమో లేసుల కాళీల్లోంచి, గుండ్రని పచ్చని వక్షాలు, వాటిమధ్య నల్లని మొనలచుట్టూ ఉన్న చక్రాలతో సహా, దోబూచు లాడుతున్నాయి. క్లారాకూడా యించుమించు అలాంటి దేవతా వస్త్రాల్లోనే వుంది.

అటు డబ్బు, యిటు సెక్స్ ఏదో ఒకటి-లేదా రెండూ అర్పించి తనని బ్లూ ఫిల్మ్ వ్యాపారంలోకి సెడ్యూస్ చెయ్యడానికే తనని అలా లాక్కొచ్చారన్నది గ్రహించాడు. వాళ్ళ ఉద్దేశాలు ప్రమాదరహితం కాబట్టి, తను నిగ్రహం చూపడం అనవసరం, అరరహితం అనుకున్నాడు.

ఫ్రీంకీ గుండె అతని గొంతుకలా కొట్లాడింది. అలా అతడి మనసుమీద అదుపు తొలగ్గానే—

"ఓకే!...అయితే, నాకో సాయం చేసిపెట్టాలిమీరు" అన్నాడు చిట్టచివరికి.

"అలాగే! యేమిటది?" అంది క్లారా, కుతూహలంగా.

"తరువాత చెప్తాను...మీ శక్తికి మించిన సాయమేమీ కాదు...అయినా యిప్పుడు మనం ముగ్గురం ఒకటి మునిగినా తేలినా" అన్నాడు ఫ్రీంకీ అభిమానంగా.

"థేంక్యూ! లెటజ్ సెలిబ్రేటిట్" అంది ఆనందంగా క్లారా. క్షణం ఆలస్యం చెయ్యకుండా టైనా గ్లాసులు నింపింది విస్కీలో.

# 6

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలవుతుండగా షూటింగ్ కార్యక్రమం మొదలయింది.

అసలు రూపాలు తెలియకుండా వుండేందుకు కావాల్సినంతమట్టుకు మేకప్ చేసుకొన్నారు.

మానవుడి లైంగిక వాంఛలు విభిన్నం, విచిత్రం. ఇండియాలో పోర్నో ఫిల్మ్‌లు చూసేవాళ్ళు ముఖ్యంగా మగవాళ్ళే, వాళ్ళ క్రేవింగ్స్ దృష్టిలో పెట్టుకుని తియ్యబడాలి బ్లూ ఫిల్మ్.

ఆ సంగతి దృష్టిలో పెట్టుకుని మొదట ఫ్రేంకీ, క్లారాతో యేక్ట్ చేసాడు. సన్నగా, షార్ట్ ఫీచర్స్‌తో ఉండే ఆడవాళ్ళని యిష్టపడే మగాళ్ళకు, ఆ ఫిల్మ్ పాలకోవలా వుంటుంది.

ఆ తరువాత టైనాతో నటించాడు. బలిష్ఠమైన అవయవాలు, గుండ్రని ఫీచర్స్‌గల స్త్రీని జపించే పురుషులకు ఆ ఫిల్మ్ చక్కని అనుభూతి.

షూటింగ్ పూర్తయి, పేకింగ్ కానిచ్చి, తిరుగు ప్రయాణం మొదలుపెట్టేసరికి, సాయంకాలం అయిదయింది. రాత్రి ఎనిమిది కావస్తుండగా వాస్కో చేరుకున్నారు ముగ్గురూ.

ఫ్రేంకీని అతడింటివద్ద వదిలిపెట్టి బయలుదేరుతూ "ఇదిగో యిది నా పేమెంటు" అంది క్లారా, అతడి చేతిలో ఓ నోట్ల కట్టల పేకెట్టు పెట్టి.

పేకెట్టు అందుకుని, చేతిలో వుంచుకుని, ఆలోచించడం మొదలుపెట్టాడు ఫ్రేంకీ.

రేపు మోటరు బోటు అద్దెకు గాని అమ్మకానికిగాని తీసుకోవాలంటే యీ డబ్బు పనికొస్తుంది. అయితే మోటరు బోటు కొనే వ్యవహారం మూడో వ్యక్తిద్వారా చేయించడం చాలా శ్రేయస్కరం. అటువంటప్పుడు,

లాభ నష్టాల మాటకేంగాని, డబ్బుకు బదులుగా క్లారాని బోటు కొనియిమ్మంటేనే శ్రేష్ఠంగా ఉంటుంది.

"నాకీ డబ్బు దేనికి క్లారా. కావాలంటే తిరిగి నేనే ఇవ్వగలను. నాకో మోటారు అద్దెకు గాని, అమ్మకానికి గాని యీ డబ్బుతో తెచ్చిపెట్టు" అన్నాడు ఫ్రేంకీ డబ్బు తిరిగి ఆమె చేతిలో పెడ్తూ.

"కీపిట్!...ఏం సాయంకావాలన్నా చేస్తానన్నాగా.. అంతా యిచ్చేయకు...సగం చాలేమో" అంది క్లారా.

"నాకు డబ్బు వద్దు. నేను చేసిన సాయానికి ప్రతిఫలంగా నేను కోరిన సాయం చేసిపెట్టు...బోటు నీ పేర్న వుండనీ...అంతే!" అన్నాడు ఫ్రేంకీ.

"యేమిటి సంగతి? యేదన్నా స్మగ్లింగ్ వ్యవహారమా? నాకు కొంతమందిని తెలుసు...నీకేం యిబ్బంది లేకుండా చూడగల్ను" నవ్వి అంది క్లారా.

"నో! నో! స్మగ్లింగ్ కోసం కాదు. స్మగ్లర్స్‌ని పట్టుకోవడానికి."

"మీ డిపార్టుమెంటు బోట్సు ఉన్నాయిగా."

"అవి పగలు వాడుకోవడానికే. తప్పితే, స్పెషల్ ఆపరేషన్సు కోసం."

"మరీ అంత సిన్సియారిటీ పనికిరాదు...వాళ్లూ బ్రతకాలి...నువ్వూ బ్రతకాలి అన్నట్టుగా ఉండాలి."

తను అబద్ధాలు చెప్తున్నట్టుగా బయట పెట్టేసుకుంటున్నట్టు చప్పున అర్థమైంది ఫ్రేంకీకి.

"అదికాదు క్లారా. స్మగ్లింగ్ చేసే వ్యాపారంమీద మాకో పెర్సంటేజ్ వుంది. కొందరు వెధవలు, మాకు కూడా టోపీ వేసి, చిన్న మొత్తాలు చెల్లించి చేతులు దులి

వేసుకుంటున్నారు. వాళ్ళనో పట్టుబట్టాలి...దీనికి డిపార్టు మెంటు మద్దతు ఉందనుకో...కాని డిపార్టుమెంట్ బోట్సు యిందుకు వాడడం మంచిదికాదు...యే సి.బి.ఐ వాళ్ళో యాంటీ కరెప్షన్ వాళ్ళో చెక్ చేస్తే, ఇదంతా నా సొంత వ్యవహారంలా ఉండాలిగాని, తతిమ్మా వాళ్ళు చిక్కుకోకూడదు'' చెప్పాడు ఫ్రేంకీ.

''వెరీగుడ్ అలాగుండాలి...అలా ప్లెయిన్‌గా చెప్పేస్తే నీ అవసరాలేమిటో తెలుసుకుని నీకు కావాల్సినవిధంగా యేర్పాట్లు చెయ్యడానికి వీలుంటుంది...ఓకే'' అంటూ వెళ్ళిపోయింది క్లారా. ఫైనా ఆమెను అనుసరించింది.

# 7

మోటారు బోటు యేర్పాటుచెయ్యడానికి సుమారుగా వారంరోజులు పట్టింది క్లారాకి.

''నీ బోటు రడీ!...నువ్వు కోరినట్టుగానే బోటు నా పేరన ఉంది. బోటుని చేపలు పట్టడానికి, షికారుకి మాత్రం ఉపయోగించాలి. చట్ట విరుద్ధమైన శేదా యేలాంటి నిషేధ వస్తువులు తేవడానికిగాని, నిషేధ కార్యక్రమాల్ని కొనసాగించడానికిగాని దాన్ని వినియోగించరాదు. ఉపయోగించినచో, చట్టప్రకారం శిక్ష విధించబడును'' అంటూ గడగడా చెప్పేసింది క్లారా, ఓ రోజు ఫ్రేంకీ యింటికి వచ్చి.

బోటు ట్రాన్స్‌ఫర్ పేపర్స్‌లో యేముందో, అదే క్లారా ఓ ముక్క కూడా వదిలిపెట్టకుండా అప్పజెప్పిందని ఫ్రేంకీకి తెలుసు. నవ్వి ''థేంక్స్ ఫర్ ది హెల్ప్'' అన్నాడు.

''నో మెన్షన్...కాని నాదో రిక్వెస్ట్.''

"ఏమిటో అది?"

"మీ ఆపరేషన్స్ ఎలా వుంటాయో చూడాలని యింట్రస్ట్. కాని నీకేమాత్రం అభ్యంతరంవున్నా వద్దనేయ్ నేను రాను."

"అదేంలేదు...నువ్వు రావచ్చు...కాని నేనేం చేసినా ఒక్క ముక్క బయటికి యెవ్వరికీ చెప్పకూడదు."

"అలాగే ప్రామిస్!" అంది ఫ్రేంకీ చేతిలో చెయ్యి వేసి.

"అయితే, యివాళ రాత్రివుంది మనబోటు షికారు... వస్తావా?"

"వస్తాను. ఎన్ని గంటలకు?"

"రాత్రి పదిదాటాక యిక్కడికి రా పన్నెండు అయ్యే సరికి మనం మిడ్ సీలో వుండాలి."

"ఓ కే...ఫిక్స్డ్" అని వెళ్ళిపోయింది క్లారా.

క్లారా వెళ్ళిపోయేక, రాత్రిట్రిప్పుకు కావాల్సిన యేర్పాట్లు చేసేడు ఫ్రేంకీ. ఒక పోలిథీన్ కవరులో బిర్యానీ, ఓ ఫ్లాస్కునిండా నల్లని స్ట్రాంగ్ టీ, రెండు బిస్కట్ పాకట్లు, ఒక సెన్డ్విచ్ బ్రెడ్, ఒక బాస్కెట్ వుంచాడు. ఆ తరువాత రెండు పెగ్గుల ఓల్డుమాంక్ రమ్ కొట్టి, రాత్రిభోజనం కానిచ్చాడు.

అప్పటికి రాత్రి తొమ్మిదిన్నర అయింది. వరండాలో రాకింగ్ ఛెయిర్ వేసుక్కూచుని మెల్లగా ఊగుతుంటే మిగతా అరగంట ఎలా గడిచిపోయిందో గుర్తేలేదు అతడికి. క్లారా వచ్చి ఎదురుగా నిలబడి "రడీయా?" అని అడిగేసరికి ఈ లోకంలోకి వచ్చిపడి, వాచీ చూచుకున్నాడు. సరిగ్గా పదీపది అయింది.

చప్పున లేచి, అయిదు నిముషాల్లో డ్రస్ మార్చుకొని వచ్చాడు. మరో అయిదు నిముషాల్లో యిద్దరూ బయలు దేరారు.

ఆకాశంలో శుక్లపక్షపు అష్టమి చంద్రుడున్నాడు. పసుపు కలిసిన చిక్కని పాలు ఒలికినట్టుగా వుంది వెన్నెల.

ఫ్రెంకీ యింటికి రెండుఫర్లాంగుల దూరంలో వుంది సముద్రతీరం.

పది నిముషాల్లో సముద్రపొడ్డుకు చేరుకున్నారు.

మూడొంతులు యిసుకలోనూ, ఒకవంతు నీటిలోనూ తడుస్తూ తీరానున్న ఒక కొబ్బరి చెట్టుకు నైలాన్ మోకుతో కట్టబడివుంది మోటారుబోటు. సగంవరకూ నీలాకాశపు రంగూ, ఆ మీదట తెలుపురంగూ పెయింట్ చెయ్యబడి నీటుగావుంది బోటు. దానిమీద తెలుపుమీద ముదురు నీలంరంగులో 'జలరాణి' అన్న పేరు విడి అక్షరాలు సుందరంగా రాయబడివున్నాయి.

అలాంటి బోట్లను నటపడంలో ముందే సరియైన ట్రెయినింగ్ యివ్వబడివుందేమో, దాన్ని చూస్తూనే, తనో చక్కని బోటు సంపాయించాడనుకున్నాడు ఫ్రెంకీ.

మోకు ముడివిప్పి, బోటుని యిద్దరూ నీళ్ళలోకి తీసుకెళ్ళారు. గుండెలబంటి నీళ్ళల్లోకి వెళ్ళాక, ముందుగా క్లారాని యెక్కించాడు బోటులోకి. ఆ మీదట తను చెంగున యెగిరి కూచుని మోటారు స్టార్ట్ చేశాడు.

ఫ్రెంకీ బోటు ఎక్కడికి వెళ్తోందో, ఎందుకు వెళ్తోందో ఎవరికీ అనుమానలేశంకూడా కలగడానికి అవకాశం లేదు. కారణం? ఆ వేళల్లో బెస్తవాళ్ళబోటు సముద్రం

లోకి బయలుదేరి వెళ్ళి, చేపలు పట్టేవాడడం అతి మామూల్మాలు విషయం. అందుకే దూరంగా చిన్న ఎరుపు, ఆకుపచ్చ దీపాలు వెలిగించుకుంటూ, చాలాబోట్లు సముద్రం దిక్కుగా పోతూ అవుపిస్తున్నాయి.

ఆకాశంలో ఒక్క మబ్బుకూడా లేదు. చంద్రుడు, చుక్కలు, కడిగిన వెండినగల్లా తళతళలాడుతూ అవుపిస్తున్నాయి. చిన్నగా చలికూడా మొదలుపెట్టింది.

అప్పటికిబోటు చాలాదూరం వచ్చింది సముద్రంలోకి. సుమారుగా నాలుగైదు మైళ్ళు వచ్చిందేమో...

"ఓ మైగాడ్!" అంటూ అరిచాడు పట్టలేని ఆనందంతో.

"ఏమైంది ఫ్రేంకీ?" ఆత్రంగా అడిగింది క్లారా.

అప్పుడర్థమైంది ఫ్రేంకీకి, తనను తాను బయటపెట్టేసుకున్నట్టు. కాని, తన మాటలకు ముసుగు తగిలించి వేరే అర్థం కలిగించి, క్లారా అనుమానాన్ని అక్కడితోనే అంతం చెయ్యదల్చుకున్నాడు.

"నథింగ్! అటు చూడు ... వాటె బ్యూటిఫుల్ సైట్" అన్నాడు వేలితో చూపి.

ఒక ఫర్లాంగు దూరంలో లయాన్వితంగా నీళ్ళని చీలుస్తూ, శోభనపు పెళ్ళికూతురులా, మాస్ట్ మీద, డెక్ మీద లెక్కలేనన్ని రంగురంగుల దీపాలతో, హుందాగా అందంగా వస్తోంది సబ్ మెరైన్ మదర్ షిప్ ఐ. ఎన్. ఎస్. అంబా. దానికి కాస్త దూరంలో దాని వెనుకగా, నిశ్శబ్దంగా, ఏలాంటి సందడీలేకుండా, నీటిలో తేలుతూ కదులుతున్న తిమింగలపు పిల్లలా వస్తోంది జలాంతర్గామి కల్వారి.

"వాటీస్ స్ట్రేంజ్?" అంది క్లారా పెదవి విరిచి.

"ఏమో మరి...యీ వెన్నెల్లో, యీ చల్లనిగాలిలో, నువ్వు ప్రక్కనుండగా చూస్తుంటే, తెల్లని నురగల్లాంటి రెక్కలున్న దేవతాపక్షిలా వుంది ఆ షిప్" అంటూ కవిత్వం ఒలకబోసాడు ఫ్రేంకీ, లోలోన త్వరలోనే, తన పథకం నెరవేర్చుకోడానికి అవకాశం వచ్చినందుకు సంతోషిస్తూ.

అంబాషిప్‌నీ, దాని వెనుకనున్న సబ్‌మెరైన్ కల్వారీని దాటి ముందుకు రెండుమూడు ఫర్లాంగుల దూరం తన బోటుని పోనిచ్చి "ఇవాల్టికి మనగ స్త్రీ చాలు వెళ్ళిపోదాం యింటికి యేం?" అన్నాడు ఫ్రేంకీ, బోటును వెనక్కి త్రిప్పి.

"నీ యిష్టం" అంతకుమించి మాట్లాడదామనిపించ లేనట్టుందా మెకు.

వెనక్కివచ్చి, మళ్ళా అంబాషిప్ చుట్టూ త్రిప్పాడు తన బోటుని ఫ్రేంకీ.

"ఆ ఓడతో ప్రేమలో పడినట్టున్నావ్?" అంది క్లారా గలగల నవ్వి.

"ప్రేమా?...ఓ కావ్యమే రాసి గానం చెయ్యాలని వుంది" అన్నాడు ఫ్రేంకీ.

తర్వాత తన బోటుని ఒడ్డుదిక్కుగా స్పీడుగా పరుగెత్తించాడు ఫ్రేంకీ.

# 8

హోటల్ లాపాజ్. వాస్కో నగరం నడిబొడ్డులో వున్న ఆరంతస్తుల ఆధునిక భవనం.

రాత్రి పన్నెండు దాటింది. ఆరో అంతస్తులో ఓపెన్ ఎయిర్‌లో ఓ కేబెరా సాగుతోంది.

మెడు దగర మిస్ జీనా గొంతు చించుకుంటూంటే టోనీ రోడ్రిగ్స్ బాండ్‌ని అద్భుతంగా డైరెక్టు చేస్తున్నాడు.

జీనా పాటకీ, టోనీ బేండుకీ అనుగుణంగా స్పాట్ లైటు వెలుగులో టేబిల్సు మధ్య తిరుగుతూ రకరకాల సొగసులు పోతోంది మిస్ వెస్లీ.

మిస్ వెస్లీ చాలా అందంగా ఆధునికంగా వుంది. అంటే సన్నని నడుం, పైన ఏపుగా ఎదిగిన స్తనాలు, దిగువున బలిష్టంగా తయారయిన తొడకండరాలు, వాటిపైన కాస్త మేరమాత్రం అచ్ఛాదనం వుంది. అదికూడా తీసేస్తానంటూ ఊరిస్తోంది ఆమె. ఎప్పుడు తీసేస్తుందో చూద్దామని సిద్ధంగా, తయారుగా ఆత్రంగా వున్నారు టేబిల్సు దగ్గరవున్న ఖరీదైన మనుషులు.

కమాండర్ చంద్రజిత్‌కు అది నాల్గోపెగ్ విస్కీ. వెస్లీ ఆట, జీనా పాట, టోనీ సంగీతం, విస్కీ మత్తు వీటిలో యేది ముందు అతని తలకెక్కిందో తెలీటంలేదుగాని, అన్ని మత్తులూ తనకి సమపాళంగా ఎక్కినట్టుగా అని పిస్తోంది అతనికి.

వెస్లీ ఆట చూడ్డానికి చంద్రజిత్ అదే హోటలుకు రావడం అది నాల్గోసారి.

"కమాండర్!"

చంద్రజిత్ పిలుపువచ్చిన దిక్కుకు చూసాడు. తన లాగే ఫుల్‌సూటులో దర్జాగా ఖరీదుగా వున్నాడు ఆ వ్యక్తి. ఆ హోటలు రేట్లుబట్టి, అతడు ఏదైనా కంపెనీకి కనీసం డైరెక్టరు అయివుంటాడనుకున్నాడు చంద్రజిత్.

అయినా నిర్లక్ష్యంగా "హూ ఆర్ యూ?" అన్నాడు.

"నేను ఫ్రేంకీ పెరైరాని. కస్టమ్స్ ఆఫీసరుని" అంటూ చెయ్యి చాచాడు ఆ వ్యక్తి.

ఆశించని పరిచయం! ఎప్పుడు ఏం అవసరమొస్తుందో యీ కస్టమ్స్ వాళ్ళతో స్నేహం కలుపుకోవడమే ఉత్తమం.

"గ్లేడ్ టు సీ యూ" అంటూ చెయ్యి చాపాడు చంద్రజిత్. చంద్రజిత్ చెయ్యి అందుకుని ఆప్యాయంగా నొక్కాడు ఫ్రేంకీ.

"ఇందాకట్నించి గమనిస్తున్నాను. వెస్లీ మీకు అంత బాగా నచ్చిందా? అంత వేడెక్కిపోతున్నారేమిటి?" అన్నాడు చంద్రజిత్ చెవిలో ఫ్రేంకీ.

నిజానికి, వెస్లీని చూసి చంద్రజిత్ ఆవేశం చెందడం, గత నాలుగురోజులుగా గమనిస్తున్నాడు ఫ్రేంకీ.

తనకు తగిన అభిరుచులున్నవాడే ఫ్రేంకీ కూడా అని చంద్రజిత్ గమనించాడు. పైగా విస్కీ మత్తు అతని నాలికను సడలించింది బాగా.

"ఏం స్తనాలు! యేం తొడలు! అయినా దూదిపింజ లాగా ఎగురుతోంది గాలిలోకి. ప్రక్కలో అయితే యింకెంత బాగా ఎగురుతుందో అని అనుకున్నాను" చెప్పాడు చంద్రజిత్, వెస్లీమీద తనలో రేగిన కసిని మాటల్లోకి మార్చి.

సన్నగా నవ్వాడు ఫ్రేంకీ.

"మీరు కావాలంటే, ఆమెను యేర్పాటు చెయ్యగలను. మేనేజ్‌మెంట్‌తో ఒక్కమాట... కాని?" ఆగాడు ఫ్రేంకీ, సంగీతం జోరు హెచ్చుకావడంతో.

కేబెరా ముగింపుకు వచ్చేసింది. ఒంటిమీదున్న ఆ

కాస్త అచ్ఛాదన లాగిపారేసింది వెస్లీ. జనం ఆవేశంతో చప్పట్లు కొట్టారు.

లైట్లు వెలిగాయి. వెస్లీ అదృశ్యమైపోయింది.

"కాని?" అన్నాడు చంద్రజిత్, ఫ్రేంకీవైపు తిరిగి. సంభాషణ కొనసాగించమన్నట్టుగా.

"ప్రక్కలో తడిగుడ్డ" చెప్పాడు ఫ్రేంకీ.

"అంటే?"

"అది సుఖం యివ్వలేదు."

"అంటే, మీరు చాలా రకాలు రుచిచూచినట్టుగా వున్నారు" చంద్రజిత్ కొంటెగా నవ్వి అన్నాడు.

"సరేగాని రేపు నా విల్లాకి రావడానికి మీకేమన్నా అభ్యంతరమా?"

అది తనకు ఆహ్వానమని, ఆ ఆహ్వానంలో తనకు ఓ రంజయిన అమ్మాయిని పరిచయం చేసే హింట్ ఉందని గ్రహించాడు చంద్రజిత్.

"దెన్, ఎక్కడ? ఎలాగ? ఎన్నిగంటలకు కలిసేది?" అన్నాడు చంద్రజిత్ టక్కునలేచి.

అన్ని వివరాలూ చెప్పి, 'గుడ్ నైట్' అని వెళ్ళిపోయేడు ఫ్రేంకీ.

# 9

ఆ మర్నాడు సాయంకాలం ఆరుదాటాక, కమాండర్ చంద్రజిత్ని యింటికి మోసుకుపోయింది ఫ్రేంకీ మెర్సిడిస్ కారు.

"వెల్కమ్ టూ యూ సర్" అంటూ బెల్ ఫ్రాక్స్లోవున్న యిద్దరు బత్తాయిల్లాంటి అమ్మాయిలు ఎదురొచ్చి చంద్రజిత్ని ఆహ్వానించేసరికి, ముందు కొైనా

వైపు చూడాలో, లేక క్లారావైపు చూడాలో అర్థం గాక, ఒకేసారి యిద్దరివైపు చూడ్డం ఎలాగో తెలీక, క్షణానికొకరివైపు చూడసాగాడు.

“మీట్ మై బూసమ్ ఫ్రెండ్ చంద్రజిత్—సారీ! కమాండర్ చంద్రజిత్” అన్నాడు ఫ్రేంకీ అమ్మాయిల్ని ఉద్దేశించి.

“గ్లాడ్ టూ సీ యూసర్” అంటూ మొదట క్లారా, తరువాత లైనా షేక్ హాండ్ యిచ్చారు చంద్రజిత్ కు.

షేక్ హాండ్ పుచ్చుకుంటూనే, అమ్మాయిలిద్దర్నీ కళ్ళతో కొలిచాడు. ఇద్దరిలోనూ, అందం, ఆకర్షణ, మత్తూ, గమ్మత్తు మస్తుగా వున్నట్టు గమనించి ఉప్పొంగి పోయేడు.

ఇద్దరిలో యెవర్ని తనకు కేటాయించబోతున్నాడో ఫ్రేంకీ.

పార్టీ యింటిముందరున్న తోటలో యేర్పాటు చెయ్యబడింది.

పొడువాటి టేబిలు మీద పాలతెలుపుమీద ఎర్ర పువ్వులున్న దుప్పటి పరచబడింది. మధ్యలో ఎర్రగులాబీలుంచిన పూలకుండీ షోగ్గా వుంచబడింది. ఒక ప్లేట్లో జీడిపలుకులు, మరో ప్లేట్లో ఫిష్ ఫ్రై, ఒక ప్లేటునిండా మటన్ మసాలాలు, ఇవిగాక, బీఫ్ కర్రీ ఒక ప్లేట్లో, ఒక పింగాణీ బేసిన్ లో పోర్క్ సూప్, స్లైస్డ్ బ్రెడ్స్ వుంచబడ్డాయి.

టేబిల్ చుట్టూ కుర్చీలున్నాయి. పెద్ద టేబిలుకు కాస్త దూరంలో ఓ చిన్న టేబిలుమీద, విస్కీ బాటిల్స్, ఐస్ క్యూబ్స్ వున్న ఐస్ బకెట్ వున్నాయి. కాక్ టెయిల్స్ కలపడంలో లైనా ఎక్స్ పర్ట్.

పార్టీ ఒకసారి మొదలయ్యాక, నిర్విఘ్నంగా కొనసాగేందుకు అన్నీ ముందే అమర్చివుంచింది లైనా.

అందరికన్నా ముందుగా క్లారా వచ్చి, చంద్రజిత్ కుడిప్రక్క కూర్చుంది. ఆ మీదట లైనాకూడా వచ్చి, అతని ఎడంప్రక్క కుర్చీ ఆక్రమించింది.

చంద్రజిత్ గుండెలు ఆవేశంగా కొట్టుకోసాగాయి.

పార్టీ మొదలయింది. సంభాషణ సౌలభ్యంకోసం, యీ మధ్యనే ముగిసిన పాకిస్తాన్ యుద్ధం గురించి మాట్లాడ్డం మొదలుపెట్టాడు చంద్రజిత్.

జనరల్‌గా యుద్ధాలగురించి, వాటిలో జరిగే తమాషాలగురించి, యీ మధ్య జరిగిన భారత్ పాక్ యుద్ధాల గురించి సంభాషణ సాగి, మెల్లగా నేవీ జీవితం గురించి చెప్పడం వచ్చేసరికి, మూడు రౌండ్లు పూర్తి అయ్యాయి

ఇరువైపులా భుజాలమీద, అమ్మాయిల మెత్తని శరీరాలు అనువని నొక్కుతుంటే, తన చుట్టూ వున్న ప్రపంచానికి ఫోర్త్ డైమన్షన్ కూడా ఉన్నట్టు ఫీలవసాగాడు చంద్రజిత్.

“ఇక్కడ చలిగా ఉంది...లోపలికి పోదామా?” అంది క్లారా వణుకుతూ సన్నగా.

“అవును...పోదాం” వంతపాడింది లైనా.

“ష్యూర్! ష్యూర్! ఇందాకే చెప్పాలనుకున్నాను. మర్చిపోయాను,” అన్నాడు చంద్రజిత్ లేచి.

క్లారా గదిలోకి దోవతీసింది. చంద్రజిత్ ఆమెను అనుసరించాడు మరబొమ్మలాగు. ఆ వెనకనే కదిలి వెళ్ళింది లైనా.

“మా కమాండర్‌ని జాగ్రత్తగా చూడండి పిల్లలూ!”

"అదేం?" పరంధామయ్య ప్రశ్న.

"ఆ దొంగవెధవ ఎర్రగా బుర్రగా వున్నాడు యింతింత
గాలూ వాడూను. వాడిని మొదటి సూపులోనే ప్రేమించే
దిట నా కూతురు. పెళ్ళంటూ చేసుకుంటే వాడినే చేసు
ంటుందిట. నా ఖర్మ!" నుదురుబాదుకున్నాడు ఆనంద
రామయ్య.

—ఐ. నరసింహమూర్తి, హైద్రాబాదు-16.

# పెద్ద నిచ్చెన?

సర్కస్‌లో ఒక అయిటమ్ ప్రదర్శిస్తున్నారు. అదేమి
టంటే క్రింద పెద్ద నీళ్ళగుంట వుంది. దాని ప్రక్కనే పెద్ద
నిచ్చెనను యిద్దరు వ్యక్తులు పట్టుకున్నారు. మరొకతను
వచ్చి ఆ నిచ్చెన చివరకెక్కి గుంటలో దూకాడు.

ఆ అయిటమ్ చూసిన ప్రేక్షకులు ఆనందంతో చప్పట్లు
చరిచారు.

అంతలో మరొకతను వచ్చి, అంతకన్న ఎత్తైన నిచ్చె
నెక్కి గుంటలో దూకాడు. ఈసారి ప్రేక్షకులు మరింత
నందంతో కరతాళధ్వనులు చేశారు.

మూడోసారి ఇంకొకతను వచ్చి మొదటి రెండింటికంటే
త్తైన నిచ్చెన తెప్పించి ఎక్కడం మొదలెట్టాడు. అది
చూసిన ప్రేక్షకులు మరింత ఉత్సాహంతో ఈలలు వేస్తూ
చప్పట్లు చరుస్తూ 'ఓహో' అంటూ ఊగిపోసాగారు
ఆనందంతో.

పైకెక్కిన వ్యక్తి ఓసారి అందరివైపు చూసి, పైన

వున్న లైటును సరిచేసి మళ్ళీ నిచ్చెనతో దిగి లోనికి వె
పోయాడు.

ప్రేక్షకులు తెల్లమొహం వేశారు.

—రోజాచలం, బెల్లంపల్లి

## మార్గదర్శకుడు?

పల్లెటూరినుండి పట్నం పండక్కి అత్తవారింటికి వెళ్ళిన కొత్తల్లుడు, అలవాటు ప్రకారం తెల్లవారు ఝామున ఐదింటికి లేచి, చెంబు వెతుక్కొని దాని నిండా నీళ్ళు నింపుకుని రోడ్డున పడ్డాడు.

కానీ ఆ మహానగరంలో ఎటువెళ్ళాలో తెలియక అటు ఇటు చూస్తున్న అతనికి అతని ముందుగా ఇంకో మనిషి చెంబు పట్టుకు వెళ్తుండడం కన్పించింది. "ఆ.... దొరికాడు మార్గదర్శకుడు. ఇతన్ని ఫాలో అవుతాను. ఇతను ఎక్కడ కూర్చుంటే నేనూ అక్కడే కూర్చుంటాను" అని అనుకుని బయలుదేరాడు అతనివెంట.

అతడు కొన్ని సందులు, గొందులు మలుపులు తిరిగి తిరిగి ఆఖరికి మెయిన్‌రోడ్డులో వున్న మిల్క్‌బూత్ 'క్యూ' చివర వెళ్ళి కూర్చున్నాడు.

'ఓహో! పట్నంలో అన్నిటికీ 'క్యూ'నే అన్నమాట! అనుకొని, తనూ వెళ్ళి అతని ప్రక్కనే బట్టలువిప్పి కూర్చున్నాడు.

పాపం క్యూలోని జనం తెల్లముఖం వేశారు.

—ఎస్. రామారావు, రాయగడ

———

